తమిళమూల రచయిత:తాండవరాయస్వామి

ఆంగ్లానువాదకులు:శ్రీరమణానందసరస్వతీస్వామి
(పూర్వాశ్రమనామము:మునగాల వేంకటరామయ్య)

ఆంధ్రానువాదకుడు:పన్నాల రాధాకృష్ణశర్మ

శ్రీ రమణాశ్రమము
తిరువణ్ణామలై - 606 603
ఇండియా.



# విన్నపము

శ్రీభగవద్రమణమహర్షి తఱచుగా పేర్కొను వేదాంతగ్రంథములలో కైవల్య నవనీతము' ఒకటి. ఇది ముముక్షువులగు సాధకులకు అవశ్యపఠనీయమయిన అత్యుత్తమ వేదాంతగ్రంథము.

ఇందలి విషయము పరమగంభీరమయిన వేదాంతక్షీరమునుండి తీసిన తీయని వెన్నవంటిది. ఈ ఒక్క గ్రంథమును శ్రద్ధా భక్తులతో గాఢముగా అధ్యయనము జేసినచో గహనమయిన అద్వైతవేదాంతము అతిసుగమమయి, ఆస్వాదయోగ్యమయి, ఆచరణానుకూలమయి మోక్షదాయకము కాగలదు.

1965లో శ్రీరమణాశ్రమమువారు ప్రచురించిన శ్రీరమణానంద సరస్వతీస్వామి విరచితమయిన ఆంగ్లానువాదము ననుసరించి ఈ ఆంధ్రానువాదము చేయబడినది.

ఈ తెలుగు అనువాదము సోదర సాధకాంధ్రులకు పరమోపకారము కాగలదని విశ్వసించుచున్నాను.

హైదరాబాద్ శ్రీభాగవత చరణరేణువు
18.8.2008 ఆంధ్రానువాదకుడు

ఓం నమో భగవతే శ్రీరమణాయ

# కైవల్య నవనీతము

1. ధన, భూమి, స్త్రీవాంఛలకు వశులయిన వారును, కానివారునగు సర్వజీవుల హృదయములలో ఆకాశమువలె కేవల సాక్షిగా ఉండి, అన్యములయిన సమస్త మానసిక భూమికలకంటే స్వయముగా ఉత్కృష్టమయిన ఏడు క్రమానుగతములగు ఆధ్యాత్మిక శిఖరముల పయిన అత్యున్నత శిఖరముగా విరాజిల్లుచు సప్త పావనక్షేత్రములలో

పావనతమమయిన 'నన్నిలము' లో వేంచేసి యున్న అద్వితీయ పరమేశ్వరుని పవిత్ర చరణములకు సాష్టాంగ ప్రణామములు.

2. విశ్వము యొక్క సృష్టి-స్థితి-లయములకొఅకు బ్రహ్మ- విష్ణు-మహేశ్వరులుగాను, అసంఖ్యాకజీవులుగాను గూడ అభివ్యక్తమగు చున్నప్పటికి నిత్యస్వతంత్రముగా ఉండి ఆనందాకాశమున దేదీప్యమాన సూర్యుని వలె నిరంతరము భాసించుచున్న శుద్ధ చైతన్యమును ఆరాధింతును.

3. తన అనుగ్రహముతో నా ఆత్మయే సర్వవ్యాపకమయిన బ్రహ్మమనియు, నానావిధమయిన విశ్వమంతయు నాయందు గోచరించు కేవల దృశ్యమనియు తెలియజేసి గోడలోని ఆకాశమువలె ఆత్మగా ఉన్న నా గురుదేవుని పాదపద్మములను సర్వదా పూజింతును.

4. "నీవు నేను ఒక్కరే"- అని తాను నాకు ఉపదేశించినపుడు సూర్యుని ముందు మంచువలె సత్యమయిన నా (ఆత్మ) జ్ఞానమునకు మనస్సు, బుద్ధి, ఇంద్రియములు, శరీరము నిరర్ధకములు కాగలవనెడి తలంపుతో నన్ను తనతో ఏకము గావించుటకై నా గురువుగా సాక్షాత్కరించిన సర్వేశ్వరుని అర్చింతును.

* 1. శుభేచ్ఛ 2. విచారణ 3. తనుమానిసి
4. సత్త్వాపత్తి 5. అసంసక్తి 6. పదార్థా భావని.
7. తురీయము- అనునని ఏడు ఆధ్యాత్మిక శిఖరములు లేక జ్ఞాన భూమికలు.

5. ఆది మధ్యాంత రహితమయిన విశాలాకాశమువలె విలసిల్లుచున్న పావన గురుదేవుని చరణములకు ప్రణమిల్లి, శాస్త్రములను తెలిసికొనజాలని అజ్ఞానులు గూడ అర్ధము చేసికొనవచ్చునను తలంపుతో బంధ-మోక్షములను వివరించుటకై పరమాత్మ యొక్క సత్య స్వరూపమును మీకు చెప్పుటకు ఉపక్రమించుచున్నాను.

6. ప్రాచీన మహర్షు లందరు అపారమయిన వేదాంత క్షీరసాగరమునుండి గ్రహించిన జ్ఞాన క్షీరముతో సూత్రములు, భాష్యములు, ఇతిహాసములు, కావ్యములు అను తమ గ్రంథ భాండములను నింపినారు. నేను వానిని అన్నిటిని గురువచనాగ్నితో కాచి, ఆత్మవిచారమను కవ్వముతో మథించి తీసిన ఈ 'కైవల్యనవనీతమును' సర్వజనులకు సమర్పించుచున్నాను.

ఇక ఈ కైవల్య నవనీతమును భుజించి తమ జిజ్ఞాస అను ఆకలిని తీర్చు కొన్న వారు ప్రాపంచిక జీవిత మను ఉచ్ఛిష్టమును భుజించుచు అటు ఇటు పరిభ్రమింతురా?

7. స్వయముగా నిత్యస్వతంత్రుడయి నన్ను తనవానినిగా జేసికొన్న వేంకటేశ ముకుంద నామధేయుడగు నా గురువును అర్చించి ఈ కైవల్య నవనీతమును రెండు భాగములుగా రచించుచున్నాను; వానిలో మొదటిది స్పష్టమయిన తత్త్వవివరణము; ఇక రెండవది మొదటి దానిని చదువునపుడు గలుగు సందేహములను నివారించును.

# ప్రథమ భాగము

# తత్త్వ వివరణము

8. తత్త్వసాక్షాత్కారమునకు ఆవశ్యకమయిన పూర్వనియమములు నాలుగున్నవని మహర్షులు చెప్పుచున్నారు. వీనిని 'సాధన చతుష్టయము' అందురు. 1. వివేకము-నిత్యానిత్యవివేకము, అనగా, అనిత్యములయిన ప్రాపంచిక విషయములకు, శాశ్వతమయిన సద్వస్తువునకు మధ్యగల భేదమును గ్రహించుట. 2. ఇహాముత్ర ఫలభోగ విరాగము,

అనగా, ఇహలోక పరలోక భోగములయందు వైరాగ్యము. 3. శమాది షట్కసంపత్తి. 4. ముముక్షుత్వము, అనగా, మోక్షకాంక్ష.

9,10. శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానము- అను ఆఱుగుణములను "శమాది షట్కసంపత్తి" అందురు. వీనిలో 'శమము" అనగా మనోనిగ్రహము; ఇంద్రియనిగ్రహము 'దమము'; వర్ణధర్మ కుటుంబాదులకు సంబంధించిన కార్యములను విరమించుట 'ఉపరతి'; మనోవికార నిగ్రహము, సహనము 'తితిక్ష' అనబడును. శాస్త్ర గురువచనములయందు విశ్వాసము 'శ్రద్ధ'; శాస్త్రములు, జ్ఞానులు తెలిపిన విధముగా తత్త్వ విచారమునందు మనస్సును నెలకొల్పుట 'సమాధానము' అగును.

11. తగిన సాధనసంపత్తి లేకుండా ప్రపంచమునందు ఎవ్వరును దేనిని సాధింపజాలరు. అందువలన పయిని చెప్పబడిన సాధన చతుష్టయసంపన్నులైన వారు మాత్రమే జ్ఞానమును పొందగలరు. ప్రారంభకుడు అంత త్వరగా జ్ఞానమును పొందజాలడు. ఒక వేళ ఏ వ్యక్తి అయినను అట్లు జ్ఞానమును పొందిన అసంఖ్యాకములయిన పూర్వజన్మలలో అతడు క్రమముగా పవిత్రు డయినాడని గ్రహింపవలెను.

12. ఆధ్యాత్మిక- ఆధిదైవిక-ఆధిభౌతికము లను త్రివిధ తాపములతో బాధపడుచు, ఎండవేడిమికి తపించిన క్రిమివలె మిగుల దుఃఖితుడయి తాపహేతువులయిన పునర్జన్మ పరంపరను అంతమొందింపవలెనను తలంపుతో విజ్ఞానామృతమునందు మునుగవలెనని తహతహపడు వ్యక్తియే జ్ఞానమునకు అర్హుడు.

వివరణము: ఆకలి, దప్పిక మొదలగునవి ఆధ్యాత్మిక తాపములు; శీతోష్ణములు, వాన, రోగము మొదలగునవి ఆధిదైవిక తాపములు; దొంగలు, క్రూరమృగములు మొదలగు వానివలన గలుగు బాధలు ఆధిభౌతిక తాపములు.

13. మోక్షకాంక్ష పెరిగిన కొలది కళత్ర, పుత్ర, ధనాదులయందు విరక్తుడయి అతడు వేటగాని వలనుండి తప్పించుకొన్న లేడివలె వారినుండి పారిపోయి సద్గురువును ఆశ్రయించి హృదయ పూర్వకముగా ఆయనకు ప్రణమిల్లినాడు.

14. ఆసక్తితో తన గురువునకు నమస్కరించిన తరువాత అతడు లేచి నిలబడి గద్గద కంఠముతో తన హృదయమును విప్పి యిట్లు పలికినాడు: - "ప్రభూ! అంతిమముగా అసత్యమయిన ప్రాపంచిక యాతనలతో చాలకాలము బాధపడితిని. అనుగ్రహ రూపా! గురుదేవా! పంచకోశములకు నన్ను బంధించు పాశములను ఛేదించి, నన్ను కాపాడి, నా హృదయమునకు శాంతిని ప్రసాదింపుము".

వివరణము :పంచకోశములు: 1. అన్నమయము
2. ప్రాణమయము 3. మనోమయము
4. విజ్ఞానమయము 5. ఆనందమయము.

15. అపుడు ఆ సద్గురువు ప్రేమతో తాబేలు తన గ్రుడ్లను గూర్చి తలంచినట్లుగా అతనిని గూర్చి తలంచి, చేప తన గ్రుడ్లను జూచునట్లుగా అతనిని జూచి, పక్షి తన గ్రుడ్లను తనరెక్కలతో కప్పిన విధముగా అతనిని తన చేతులతో నిమిరి యిట్లు చెప్పినాడు:- "నీ పునర్జన్మలను అంతమొందించుటకు ఒక ఉపాయమున్నది. నేను చెప్పినట్లు నీవు చేసినచో నీ పునర్జన్మలు నశించును."

వివరణము: తాబేలు, చేప, పక్షి ఉదాహరణములు క్రమముగా మౌన దీక్ష, దృగీక్ష, స్పర్శ దీక్ష - అను మూడు దీక్షలను తెలుపుచున్నవి.

16. "నీ పునర్జన్మలు నశించును"- అను గురువచనములను విన్న వెంటనే అతని దేహము పులకించినది; విశాలమయిన తటాకములో స్నానము చేసిన తరువాత సేదదీరిన విధముగా అతని హృదయము ఆనందించినది; ప్రేమ

పెల్లుబికినట్లు ఆనందబాష్పములు జాలువారినవి. అంతట అతడు సద్గురుని పావన పాదములను బట్టుకొని యింకను ఇట్లు ప్రార్థించినాడు:-

17. "మీ భృత్యుడ నగు నేను మీ సూచనలను పాటించుటకు అసమర్థుడ నయినను మీరు మీ అనుగ్రహముతో నన్ను సరిచేయగలరు. 'నీ పునర్జన్మలను అంతమొందించుటకు ఒక ఉపాయమున్నది'- అని యిప్పుడే తాము చెప్పియున్నారు. దయతో దానిని నాకు చెప్పి నన్ను రక్షింపవలసినదని మిమ్ము ప్రార్థించుచున్నాను."

18. అతడు స్వయముగా వినయవంతుడని గ్రహించి గురువు ఆ శిష్యుని మనస్సును పరిశీలించి, కందురీగ చక్కగా ఎన్నుకొన్ని గొంగళి పురుగును తన భూరంధ్రములో ఉంచి అది తన నిజస్వరూపమును తిరిగి పొందుటకు వీలుగా దానిముందు ఝుంకారము జేయువిధముగా అతనికి బోధింప నారంభించినాడు:-

19,20 "వత్సా! నామాటలను శ్రద్ధగా వినుము! తన నిజస్వరూపమును మరచిన వ్యక్తి, ఆత్మయొక్క సత్యస్వరూపమును అనుభవగోచరము గావించుకొను నంతవఱకు సుడిగాలిలో చిక్కిన పక్షియాకవలె నిరంతరమయిన కాలచక్రములో గిరగిర తిరుగుచు మాటిమాటికి పుట్టుచు గిట్టుచుండును. అతడు వ్యక్తిగతమయిన ఆత్మను, దానికి ఆధారమగు పరమాత్మను తెలిసికొన్నచో అప్పుడు తాను ఆధారము, అనగా, బ్రహ్మమయి పునర్జన్మలను తప్పించుకొనును. నిన్ను నీవు తెలిసికొన్నచో నీకు ఎట్టి హానియు సంభవింపదు. నీవు అడిగిన విధముగా దీనిని నీకు నేను చెప్పితిని."

గమనిక: వాస్తవముగా ఇక్కడ ఈ పద్యమునందు ఉపదేశము ముగిసినది.

21. శిష్యుడు: "స్వామీ! మీరు నన్ను మూర్ఖునిగా భావించి యిట్లు చెప్పుచుంటిరా? ఆత్మను ఎఱుగని వారు ఎవ్వరయినను ఈ ప్రపంచమున ఉందురా? అట్టి యెడల వారందరు జనన-మరణచక్రమునందు ఎందుకు చిక్కుకొనుచున్నారు? సంపూర్ణ విశ్వాసముతో మిమ్ము వేడుకొనుచున్నాను; దోషరహితమయిన తత్త్వమును నాకు చెప్పుడు".

22. గురువు: దేహము ఎట్టిదో, దేహధారి ఎట్టివాడో-తెలిసికొన్నవాడే ఆత్మజ్ఞాని. శిష్యుడు: "ఈ స్థూలదేహము తప్ప వేఱుగా దేహధారి ఎవడున్నాడు?" ఈ మాటలను విని గురువు జాలితో నవ్వి యిట్లన్నాడు:-

23. "స్థూల దేహముకంటె వేఱుగా దేహధారి అయిన వ్యక్తిని నీవు చూడజాలనట్లు చెప్పుచున్నావు. అట్లయినచో, నీ స్వప్నమునందు విషయి (కర్త)గా ఎవడు కనిపించినాడు? లేక స్వప్నబాధసైతము లేని నిద్రను అనుభవించువాడెవడు? మరియు జాగ్రదావస్థలోని యీ చైతన్య మెట్టిది?- నాకు చెప్పుము".

24. శిష్యుడు: "జాగ్రదవస్థయందు విషయములను అనుభవించువాడుగానీ, జాగ్రచ్చైతన్యము పోయినపుడు స్వప్నములను అనుభవించువాడుగానీ, గాఢ నిద్రను అనుభవించువాడుగానీ స్థూలదేహముకంటె వేఱయినవాడు కావలెనని నిత్యానుభవము నిరూపించుచున్నది. కానీ అది అనుభవగోచరమగుటలేదు. అది మనస్సులో కేవలము మెరపువలె స్ఫురించి వెంటనే నశించుచున్నది. దయతో దీనిని వివరింపుడు."

25. జనులు బయటనున్న వ్యక్తికి ఆకాశమునందలి తదియనాటి చంద్రుని చూపుటకొఱకు నేలమీదనున్న చెట్టుపయిభాగమును నిర్దేశింతురు; సూక్ష్మమయిన అరుంధతిని గుర్తింపజేయుటకు ఇతరనక్షత్రములను జూపుదురు. అదేవిధముగా ఆ జ్ఞాని కూడ సూక్ష్మకారణమును తెలియజేయుటకై స్థూలమును తెలుపనారంభించినాడు.

26. గురువు: "వేదాంతమంతయు ఆరోప-అపవాదములు బంధ-మోక్షహేతువులుగా చెప్పుచున్నది. ఆరోపము బంధమును గలిగించును; అపవాదము మోక్షమును గలిగించును.

మొదట ఆరోపమును గూర్చి వినుము.

27. ఒక వస్తువును మరియొక వస్తువుగా జూచుటను (భ్రమించుటను) అధ్యారోపము లేక ఆరోపము అందురు. ఉదాహరణకు-త్రాడును పాముగా జూచుట; స్తంభమును మనుష్యునిగా జూచుట; ఎండమావులను నీరుగా జూచుట; శూన్యమయిన ఆకాశమును నీలమయిన చాందినిగా జూచుట.

28. అదేవిధముగా, నామరూపరహితము, ఏకము, అద్వితీయము, స్వయంజ్ఞానవంతము, పరిపూర్ణమునయిన బ్రహ్మమునందు కనిపించు పంచభూతములు వాని సమ్మేళనములు భ్రాంతికల్పితములు.

29. ఆరోపము సృష్టిని ఎట్లు ఆవిర్భవింపజేయుచున్నది-అని నీవు అడిగినచో సమాధానము ఇది:-

అనాదులగు జీవులు గాఢ నిద్రలోవలె అవ్యక్తమునందు అప్రకాశముగా ఉందురు. ఈ స్థితి కాలమనబడు ఈశ్వరుని సృష్టి సంకల్పము చేత సంక్షోభమును పొందును. అపుడు అవ్యక్తము కారణాత్మకముగా, అనగా, అప్రకాశముగా ఉండుట ఆగిపోయి త్రిగుణములు అభివ్యక్తములగును.

30. సత్త్వ-రజ-స్తమస్సులు అనునవి త్రిగుణములు. అవి క్రమముగా తెల్లగా, ఎఱ్ఱగా, నల్లగా ఉండును; లేక అవి నిర్మలముగా, మలినముగా, తేజోహీనముగా ఉండును. సమానము లయినను వానిలో ఒకటి ఎల్లప్పుడు ప్రబలముగానుండును.

31. ఇది ఒక వివరణము. మరియొక సృష్టిక్రమ వివరణముక్రింది విధముగా నుండును:-

అప్రకాశముగా నున్న కారణాత్మక (అవ్యక్త) మయిన స్థితి పిదప మహత్తత్త్వము (జీవసముదాయము)గా విస్తరించును, అది అహంకారముగా అభివ్యక్తమగును, దానిలో త్రిగుణములు ఆవిర్భవించును.

32. ఆ త్రిగుణములలో ఆకాశతుల్యమయిన చిత్ ప్రతిఫలించును. ఈ మూడు గుణములలో సత్త్వము స్వచ్ఛముగా ఉండి మాయ అనబడును. ఈ మాయయందు ప్రతిఫలించిన బ్రహ్మము ఈశ్వరుడు; ఆయన విశ్వమునకు నిమిత్తకారణము, మాయచేగానీ ఏగుణముచేగానీ కలుషితుడుకాని, సర్వాంతర్యామి.

33. ఈ మాయ ఈశ్వరుని యొక్క సుషుప్తిదశ, కారణశరీరము, ఆనందమయకోశము గూడ. రజోగుణము అవిద్య (సత్యజ్ఞానాభావము). నిరంతరసంక్షోభమువలన అస్పష్టమయిన ఈ రజోగుణమునందు ప్రతిఫలించిన చిత్ అసంఖ్యాకములగు జీవులను ఆవిర్భవింపజేయును. ఈ దశయందలి జీవుడు 'ప్రాజ్ఞుడు' అనబడును.

34. ఈదశ జీవుల యొక్క ఆనందమయకోశము, సుషుప్తిదశ, కారణశరీరము గూడ. నేను ఇంతవఱకు ఆరోపము యొక్క కారణావస్థను వర్ణించితిని.

ఇపుడు దాని సూక్ష్మదశను వివరించుచున్నాను, వినుము.

35. పిదప తనకంటె వేఱుగాని మాయయొక్క సమస్తమయిన అద్భుతశక్తులుగల ఈశ్వరుని ప్రేమపూర్వకమగు అనుగ్రహము చేత జీవులకు భోగసామగ్రిని సమకూర్చుటకై తమోగుణము రెండు దశలుగా విభక్తమయినది; అవి 1. ఆవరణశక్తి 2. విక్షేపశక్తి.

36. ఈ రెండింటిలో రెండవదయిన విక్షేపశక్తిలో ఆకాశము ఆవిర్భవించును; ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలము, రాజము నుండి భూమి ఆవిర్భవించును. ఈ అయిదు ఆరంభదశలో సూక్ష్మ భూతములు అనబడును. వీనినుండి అనుభవమునకు అనుకూలమైన దేహములు పుట్టును.

37. త్రిగుణములు పంచభూతములన్నిటిలోను వ్యాపించియుండును. స్వచ్ఛమయిన సత్త్వగుణమునుండి త్వక్, చక్షుః, శ్రోత్ర, జిహ్వ, ఘ్రాణములను పంచజ్ఞానేంద్రియములు పుట్టును. తాకుట, చూచుట, వినుట, రుచినిగ్రహించుట ఆఘ్రాణించుట అనునవి ఈ జ్ఞానేంద్రియములు చేయు పనులు. మరియు ఈ సత్త్వగుణమునుండి సమష్టికార్యముల నాచరించు మనో బుద్ధులు పుట్టుచున్నవి. సత్త్వమునుండి పుట్టిన ఈ యేడును జ్ఞానమునకు సాధనములు.

38. ఇక రజోగుణమునుండి సమష్టికార్యములను జేయు ప్రాణ-అపాన-వ్యాన- ఉదాన-సమానములను పంచప్రాణములు, వ్యష్టి (ప్రత్యేకము)గా కార్యములను జేయు వాక్-పాణి-పాద- పాయు- ఉపస్థ లను పంచకర్మేంద్రియములును జనించును. పయి పద్యములోని ఏడు, దీనిలోని పది కలిసి-మొత్తము పదునేడుతత్త్వములు దేవ, దానవ, మానవ, పశు, పక్ష్యాదుల యొక్క సూక్ష్మ (లింగ) దేహములుగా రూపొందుచున్నవి.

39. ఈ లింగదేహముతో గూడిన జీవుడు తైజసుడు అనబడును. ఇదే పరిస్థితులలో లింగదేహములో-వ్యవహరించు సమష్టి రూపుడగు ఈశ్వరుడు హిరణ్యగర్భుడు అనబడును. హిరణ్యగర్భునకే 'సూత్రాత్మ' అను నామాంతరమున్నది. ఈ లింగదేహము ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములతో గూడియుండును. ఈ లింగదేహమే ప్రాణవ్యాపారము జేయునపుడు ప్రాణమయకోశమనియు, సంకల్ప- వికల్పములను జేయునపుడు మనోమయ కోశమనియు,అహంకార-మమకార-కర్తృత్వ-భోక్తృత్వములను పొందునపుడు విజ్ఞానకోశమనియు పిలువబడును. తైజస, హిరణ్యగర్భులిరువురకు ఇది స్వప్నదశ.

40. ఇంతవఱకు సూక్ష్మ శరీరమును వివరించితిని. ఇక స్థూల శరీరము యొక్క ఆరోపవిధానమును వినుము:

నిత్యజాగరూకుడయిన ఈశ్వరుడు జీవులకొఱకు స్థూల శరీరములను, భోగవస్తువులను రూపొందించుటకై పంచభూత సమ్మేళనమును (పంచీకరణమును) గావించినాడు.

41. పంచసూక్ష్మభూతములలో ఒక్కొక్కటి రెండు సమభాగములుగా విభజింపబడినది; ఈ రెండు సమభాగములలోను ఒక్కటి మరల నాలుగు భాగములుగా విభజింపబడినది. పిదప ప్రతిభూతముయొక్క ప్రధానమయిన అర్ధభాగములో మిగిలిన నాలుగు భూతములలోని చిన్న భాగము – అనగా, సగభాగములోని నాలుగవభాగము, ఎనిమిదవవంతు కలుపబడినది. ఈ విధముగా స్థూలములయిన పంచభూతములేర్పడినవి. ఈ స్థూల భూతములనుండి జరాయుజ-అండజ-స్వేదజ-ఉద్భిజ్జములను నాలుగు విధములయిన జీవులు, వాని అనుభవములు, విశ్వము, దానిలోకములు సృజింపబడినవి.

42. స్థూల శరీరముతో గూడిన జీవుడు 'విశ్వుడు' అనబడును; అట్టి పరిస్థితులలోనున్న (స్థూలసమష్టిరూపుడగు) ఈశ్వరుడు 'విరాట్' అనబడును. అన్నమయకోశమే స్థూలశరీరము. ఇది వీరికి జాగ్రదావస్థ.

స్థూలశరీరమునకు సంబంధించిన ఈ సంగ్రహకథనమును గుర్తుంచుకొనుము."

43. శిష్యుడు: గురుదేవా! స్థూల, సూక్ష్మ, కారణశరీరములను ఉపాధులు జీవ - ఈశ్వరుల కిరువురకును సమానమయినచో ఉత్తముడగు ఈశ్వరునకును, సామాన్యుడయిన జీవునకును మధ్యగల భేదమును కనుగొనుట ఎట్లు?

గురువు: "జీవుడు కార్యము, ఈశ్వరుడు కారణము, మరియు వీరిద్దరిమధ్య వ్యష్టి-సమష్టి భేదమున్నది.

44. వృక్షములు వ్యష్టిరూపములు; వాని సముదాయము (సమష్టి) అడవి. సాధారణముగా చెప్పినచో చరాచరములయిన జీవులన్నియు వేర్వేరు వ్యష్టిరూపములు. వాని సముదాయము ఈశ్వరుడు. ఇదే జీవేశ్వరులకు మధ్యగల భేదము.

45. 'ఆరోపము' అనగా ఎట్టిదో ఇంతవఱకు చెప్పితిని. కనిపించుచున్నది అంతయు కేవలము క్షణభంగురమయిన స్వప్నము వంటిదని నిస్సందేహముగా తెలిసికొన్నవాడు మాత్రమే జ్ఞాని.

ఇక ఆరోపము యొక్క అవవాద విధానమును వినుము. ఇది-శీతకాలమునందు మేఘములు తొలగిన పిదప నిర్మలమయిన ఆకాశమును బోలిన అద్భుతమయిన మోక్షమునకు మార్గము.

46. ఒక వ్యక్తి బాగుగా పరీక్షించి, 'ఇది పాము కాదు త్రాడు; ఇతడు దొంగ కాడు లావయిన స్తంభము అని తెలిసికొనును; అదేవిధముగా సాధకుడు గురువచనమును, శాస్త్రజ్ఞానమును అనుసరించి శరీరము,ప్రపంచము, పంచభూతములు బ్రహ్మమే, అనగా, నిర్వికారమగు చైతన్యమే అని నిస్సందేహముగా తెలిసికొనును.

ఇది ఆరోపముయొక్క అపవాద విధానమని గ్రహింపుము.

47. నూలు-వస్త్రము, బంగారము- ఆభరణములు, మట్టి -పాత్రలు, వీనివలె కారణము-కార్యము ఒక్కటే. అన్నింటికి మూలకారణమయిన అవిద్య జాడ తీయునంతవఱకు శరీరమును, దాని పూర్వపూర్వ కారణములో లయింపజేయుటయే ఆరోపమును అపవాదముచేయు (తొలగించు) విధానము.

48. శిష్యుడు: స్వామీ! తమోగుణము ఆవరణశక్తి, విక్షేపశక్తి అను రెండు దశలలో పనిచేయునని తాము చెప్పియున్నారు. రెండవ దయిన విక్షేపము కోరికనుండి ఆవిర్భవించునని మీరు వివరించినారు.

ప్రభూ! ఆవరణముయొక్క ఫలితమును నాకు తెలియజేయుడు.

49. గురువు: ఆవరణశక్తి సర్వోత్తముడగు ఈశ్వరుని దృష్టిని, ఆత్మను అనుభవగోచరము గావించుకొన్న జ్ఞాని దృష్టిని తప్ప శరీరధారులగు సర్వజీవుల దృష్టిని కప్పివేయును; ఇది - "అదిలేదు- అది భాసించుటలేదు", అను రూపమున ఉండును. శీతకాలప రాత్రియందలి గాఢాంధకారము ఆకాశమును, భూమిని, దిక్కులను మనకు కనిపించనీయని విధముగా ఈ ఆవరణశక్తి సర్వజీవుల దృష్టిని ఆచ్ఛాదించును.

50. ఈ ఆవరణశక్తి బాహ్యమున పరిపూర్ణమగు బ్రహ్మమునకును, దాని పరిణామమగు ప్రపంచమునకును గల భేదమును అడ్డగించును- తెలియనీయకుండ జేయును; లోపల శుద్ధ చైతన్యరూపమగు ఆత్మకును, దాని పరిణామములగు అహంకార, మనః ప్రభృతులకును గల భేదమును తెలియనీయకుండ జేయును. కావున అనంతమయిన జనన మరణ పరంపర అనెడి ఈ దీర్ఘరోగమునకు ఈ ఆవరణశక్తి ఏకైకకారణము.

51. ఇప్పుడొక ప్రశ్న పొడముచున్నది:- ఆధారము పూర్తిగా కప్పబడినప్పుడు ఆరోపము దేనియందు ఉండగలదు? ఆధారము కప్పబడని యెడల ఏ ఆరోపమయినను ఎట్లుండగలదు? దీనికి సమాధానము ఇది: ఆధారము సామాన్యమనియు, విశేషమనియు రెండు విధములుగానుండును; వీనిలో సామాన్యమయిన ఆధారము నిరంతరముగా అవిచ్ఛిన్నముగానుండును. క్షణభంగురమయిన ఆరోపము విశేషమయినది.

52. ప్రపంచమునందు “ఇది" - అను సామాన్యమయిన ఆధారము ఎన్నడును కప్పివేయబడదు; కానీ “ఇది త్రాడు” అను ప్రత్యేకమయిన గుర్తింపుమాత్రమే కప్పబడుచున్నది. అదేవిధముగా జీవుని విషయమునగూడ అజ్ఞానము “నేను” - అను ఆధారమును కప్పివేయదు; కానీ అది “నేను బ్రహ్మము”- అను ప్రత్యేక జ్ఞానమును కప్పివేయును. మనము త్రాటిని చూచినను, పామును చూచినను “ఇది" - అను జ్ఞానము తప్పక నిలిచియుండును; అది అవిచ్ఛిన్నము, నిరంతరము, సామాన్యము,కానీ ఇది పాముగా కన్పించినపుడు త్రాటి జ్ఞానము లేదు, త్రాడుగా కనిపించునపుడు పాము జ్ఞానములేదు. త్రాడుగా గుర్తింపబడినపుడు అది సత్యజ్ఞానము, పాముగా భావించినపుడు అసత్యజ్ఞానము.

53. శిష్యుడు: "గురుదేవా! విక్షేపశక్తి పంచకోశములు, జీవుడు, ప్రపంచము మొదలగు నానావిధవస్తువులను కల్పించి శుద్ధ బ్రహ్మమును కనిపించకుండా అడ్డగించుచుండగా ఆవరణశక్తిని ఎందుకు నిందింపవలెను?"

గురువు: ఈ ప్రశ్నకు సమాధానమును వినుము: -

54. దుఃఖభరితమయిన జనన-మరణ చక్రమునకు విక్షేపశక్తి ప్రత్యక్ష కారణమయినప్పటికి అది గాఢముగా మోక్షమును కాంక్షించువారికి ఉపయోగకరముగానున్నది. మానవుని ప్రయోజకరములయిన వ్యాపారముల కొఱకు పగటివెలుగువలె రాత్రియందలి కాఱు చీకటి ఉపయోగపడగలదా? ఇంతకంటె అధికముగా నీకు నేను ఏమి చెప్పగలను? అందువలన, వత్సా! ఈ రెండు శక్తులలో ఆవరణశక్తి అధికముగా హానికరమయినది.

55. గాఢనిద్రయందుగానీ ప్రళయమునందుగానీ ప్రపంచము పూర్తిగా కనిపించనంతమాత్రమున ఎవ్వరయినను పునర్జన్మచక్రమునుండి ముక్తిని పొందినారా? విక్షేపశక్తి మొత్తము మీద మోక్షమును కలిగించును, కానీ దట్టమయిన అజ్ఞానరూపమయిన ఆవరణశక్తియే ప్రస్తుత సంసారసంకటమునకు ఏకైకకారణము.

56. విక్షేప శక్తి ముత్యపుచిప్పయందు వెండియను భ్రాంతిని గలిగించు ఆరోపమని చెప్పబడినది గనుక అది అసత్యమయినది; అట్టి అసత్య విక్షేపశక్తి వలన గలుగు మోక్షముగూడ అసత్యము కావలయునుగదా- అని నీవు వాదింపవచ్చును. దానికి సమాధానము ఇది:-

ఒక భయంకర స్వప్నము అసత్యమయినప్పటికి స్వప్నము గాంచువానిని నిద్రనుండి మేల్కొలుపును. అదేవిధముగా మోక్షముగూడ సత్యమే.

57. సాధారణముగా విషమును మరియొక విషముతో విఱిచివేయుదురు; ఇనుపమేకును మరియొక ఇనుపమేకుతో వెలికి లాగుదురు; బాణమును మరియొక బాణముతో తొలగింతురు; మురికిని మరియొక మురికి(చవుడు)తో కడుగుదురు.అదే విధముగా స్వయముగా దుర్బలమయిన అజ్ఞానమును మాయామయములే అయిన విధానములతో తొలగింపగలరు; నిర్మలమయిన మనస్సు మలినమనస్సును నశింపజేసి తానుగూడ శవదహనమున కుపయోగించు కట్టెవలె నశించును.

58. జీవులు ఈ మాయ ద్వారా ఏడు పరిణామదశలను అనుభవింతురు. ఆ దశలు: 1. అవిద్య, 2. ఆవరణము 3. విక్షేపము, 4. పరోక్షజ్ఞానము, 5. అపరోక్షజ్ఞానము, 6. దుఃఖనివృత్తి, 7 సుఖప్రాప్తి.

59,60. ఈ సప్తదశలలో, అవిద్య అనగా- అంతరాత్మ బ్రహ్మముకంటె వేఱుకాదను జ్ఞానము లేకపోవుట; బ్రహ్మములేదు, బ్రహ్మము నాకు తెలియదు- అనునది ఆవరణము; నేను మానవుడను, నేను జీవుడను- అనునది విక్షేపము; గురువచనముల ననుసరించి ఆత్మస్వరూపమును తెలిసికొనుట పరోక్షజ్ఞానము; ఆత్మవిచారణ తరువాత ఏకైక సత్త (బ్రహ్మము)గా నిశ్చలముగా ఉండుట అపరోక్షజ్ఞానము; పరిమితులు, కర్తృత్వభావన నశించుట దుఃఖనివృత్తి; అంతిమసిద్ధి, అనగా, బంధవిముక్తియే సుఖప్రాప్తి.

61. ఈ విషయమును వివరించుటకు నీకు ఒక కథను చెప్పుచున్నాను: పదిమంది ఒక నదిని దాటి ఆవలి గట్టును చేరిన పిదప వారిలో ప్రతివ్యక్తి తొమ్మిది మందిని లెక్కించి తనను వదలివేసినాడు. పదవవాడు తప్పిపోయినాడని అందరు ఆందోళన చెందిరి.

62,63. సరి అయిన జ్ఞానము లేకపోవుట అవిద్య. ఇది సంభ్రమము గలిగించును. 'పదవవాడు తప్పిపోయినాడు-కనిపించుటలేదు'- ఈ భావన ఆవరణము. సహచరుని నాశమువలన గలుగు దుఃఖము విక్షేపము. “పదవవాడు మీ మధ్య ఉన్నాడు” - అను బాటసారి యొక్క సానుభూతి వచనమును వినుట పరోక్షజ్ఞానము. దయాళువయిన ఆ బాటసారి వారిలో ఒకనిచే యితరులను లెక్కింపజేసి, లెక్కించువాడే పదవవ్యక్తి అని తెలుపగా,

తప్పిపోయిన పదవవాడు తాను అని కనుగొనుట ప్రత్యక్షజ్ఞానము. నశించిన వానిని గూర్చిన దుఃఖము తొలగుటయే దుఃఖనివృత్తి. తానే పదవవ్యక్తి అను అసందిగ్ధమయిన నిశ్చయమువలన గలుగు సంతోషమే సుఖప్రాప్తి.

64. శిష్యుడు ఇట్లు ప్రార్థించినాడు:- "గురుదేవా! కథలోని దశమవ్యక్తి యథార్థముగా తనను తెలిసికొన్న విధముగా నేను నా యథార్థమయిన ఆత్మను తెలిసికొనునట్లుగా నాకు బోధింపుడు."

గురువు: "తత్త్వమసి" (తత్+త్వం+అసి) అను మహావాక్య మున్నది. ఆ వాక్యములోని 'అసి' - అను క్రియాపదము 'తత్' - 'త్వం' అను సర్వనామములకు అంతిమార్థమున ఏకత్వమును నెలకొల్పుచున్నది. అది ఏకత్వమును ఎట్లు నెలకొల్పుచున్నదో వివరింతును, వినుము.

65. ఆకాశము ఒక్కటే అయినను నాలుగు విధములుగా నుండును. 1. మహాకాశము. 2. మేఘాకాశము 3. ఘటాకాశము 4. ఘటజలాకాశము. అదే విధముగా ఏకమయిన చైతన్యముగూడ సర్వవ్యాపకమయిన బ్రహ్మమనియు, ఈశ్వరుడనియు, ఆత్మ అనియు, జీవుడనియు నాలుగు విధములుగా " చెప్పబడుచున్నది.

66. పయిని పేర్కొన బడిన మహావాక్యములోని 'తత్' అనుపదము సర్వశక్తి సంపుడగు ఈశ్వరుని, 'త్వం'- అను పదము జీవుని బోధించును. కానీ అంతిమముగా ఆ రెండు పదములు మాయా రహితమయిన బ్రహ్మమును, పరిమితిరహితమయిన ఆత్మను తెలుపుచున్నవి. అవి ఇపుడు కాచిన పాలలోని వెన్నవలె పరస్పరము సంబద్ధములయి ఉన్నవి. పెరుగుగా మారిన ఆ పాలను చిలికి వెన్నను వేఱుచేసిన విధముగా నీవు కూడ శరీర సంఘాతమునుండి వేఱుగా ఆత్మను అనుభవగోచరము గావించుకొని వేఱుగా ఉండవలెను.

67. స్థూల శరీరము కేవలము పంచభూతముల సమ్మేళనము గనుక అది శవముతో సమానమే. అట్టి శరీరమే నేను అను ప్రస్తుత భావనను నశింపజేయుటయే జీవుని కపటోపాయములను వదలించుకొనుటకు మార్గము. మరియు, కొలిమితిత్తుల నుండి వెలువడు గాలివలె నాసికారంధ్రముల ద్వారా చలించు ప్రాణవాయువు కూడ నీవు కాజాలవు. అది కేవలము రజోగుణవ్యాపారము.

68. పరస్పరము కర్తృ-ఉపకరణ సంబంధములోనున్న బుద్ధిగానీ మనస్సుగానీ ఆత్మకాగలదా? ఈ రెండు (విజ్ఞానమయ, మనోమయ) కోశములు సత్త్వగుణవృత్తులు, నికృష్టమయిన గాఢ నిద్రానందము ఆత్మ అని భ్రమింపరాదు, ఏల అనగా అది కేవలము తమోగుణవృత్తి.

69. "త్వం' (నీవు) ఆత్మగా సమానము, నిర్వికారము, ఏకము, శాశ్వతము సర్వవ్యాపకమునగు సాక్షి అయిన సత్-చిత్- ఆనందమని తెలిసికొని దానికి విరుద్ధస్వభావముగల-అసత్యము, జడము, బాధాభరితమునగు– పంచకోశముల బోనునుండి నిన్ను తప్పించుకొనుము."

70. శిష్యుడు: "నేను నన్ను పంచకోశముల నుండి వేఱుచేసి తదతీతముగా జూచినపుడు కేవలము ఒక్క శూన్యమే మిగిలినది. దానికంటె అధికముగా దేనిని నేను జూచుటలేదు. నేను ఈ శూన్యమునే సర్వోత్తమ మయిన ఆత్మానుభూతిగా భావింపవలెనా? గురువరా! దీనిని యథార్థముగా నాకు చెప్పుడు."

71. శిష్యుని విజ్ఞప్తిని విన్న పిదప గురువు మరియు ఇట్లన్నారు:- "కథలో భ్రమించిన బుద్ధిగల దశముడు తొమ్మిదిమందిని మాత్రమే లెక్కించిన తరువాత తనను దశమునిగా గుర్తింపక నిశ్చేష్టుడయినాడు. అట్టి నిశ్చేష్టత దశముడు కాగలడా? ప్రియవత్సా! నీవు సమస్తమును ('శూన్యమును', 'పంచకోశములను') చూచువాడవు.

72. పావనవటవృక్షము క్రిందనున్న ప్రభువు సాక్షిగా సత్యమును చెప్పుచున్నాను:- ఆనందసాగరము నందలి తరంగములవలె అనంతముగా లేచుచు పడుచున్న స్థూల-సూక్ష్మ-కారణశరీరములకు, జాగ్రత్-స్వప్న-సుషుప్తి అవస్థలకు, కాలగమనమునకు-భూత, భవిష్యత్, వర్తమానములకు- నీవు నిర్వికారసాక్షివి.

73. 'సర్వమును దర్శించు సాక్షి అయిన నన్ను నేను ఏ వెలుగుతో చూడగలను?'- అని నీవు అడుగవద్దు. స్వయంప్రకాశమానమయిన జ్యోతిని ప్రకాశింపజేయుటకు వేరొకవెలుగు ఉండగలదా? దశముడు ఇతరులమధ్య తనను దశమునిగా తెలిసికొనును- అతనిలో పదునొకండవవాడు (దశముని తెలిసికొనువాడు) ఉన్నాడా?

74. జ్ఞానమును తెలిసికొనుటకు మరియొక జ్ఞానము ఆవశ్యకము అని వాదించుట మూర్ఖత్వము; ఏల అనగా, ఆ తెలిసికొను జ్ఞానమును తెలిసికొనుటకు మరియొక జ్ఞానము కావలెను. ఇది ఈ విధముగా అనంతమయిన వివాదమునకు (అనవస్థాదోషమునకు) దారి తీయును. నీవు తెలియబడినవాడవు గానీ తెలియబడనివాడవుగానీ కావు. నీవు నిన్ను స్వయంప్రకాశమానమయిన జ్ఞానముగా అనుభవగోచరము గావించుకొనుము.

75. చక్కెర స్వభావము మధురము గనుక దానితో జేయు పదార్థములు మధురముగా ఉండుట లేదా? అట్లే నిన్ను 'అహం' (నేను) యొక్క అర్థముగా తెలిసికొనుము; అది (ఆ నేను) 'ఇది', 'అది' అని వస్తువులను తెలియజేయును. కానీ అది స్వయముగా వానికి అతీతముగా నుండును. అనగా విషయములను తెలిసికొనుజ్ఞానము విషయములను తెలియజేయుచున్నను వానికి అతీతముగా నుండునని భావము.

76. 'తత్త్వమసి'- అను మహావాక్యములోని 'త్వం' (నీవు) అను పదమునకు ముఖ్యార్థము ఆత్మ; 'తత్' (అది) అను పదమునకు ముఖ్యార్థము ఎన్నడును పరిమితులకు బద్ధముగాని బ్రహ్మము. ఈ రెండు పదముల యొక్క గౌణమయిన (అముఖ్యమయిన) అర్థములు క్రమముగా క్షణభంగురుడైన జీవుడు, ఈశ్వరుడు. రెండు విభిన్న తత్త్వములు ఎన్నడును సమానములుగా ఉండజాలవు.

77. జీవేశ్వరులకు మధ్యగల భేదములకు కారణము వారి నామములు,స్థానములు, కృత్రిమయిన పరిమితులు, శరీరములు, సామర్థ్యములు. వారిరువురు స్వర్గ పాతాళములంత భిన్నము. ఈ పయిని జెప్పిన సంబంధములవలన వారి _ ఏకత్వము ఊహించుటకు గూడ వీలు గానిది.

78. పదముల ముఖ్యార్థములు (వాచ్యార్థములు) విరుద్ధములుగా (పొసగనివిగా) ఉన్నపుడు ప్రాచీన పండితులు మూడువివరణములను-లక్షణావృత్తులను- ఉపయోగించి సత్యమయిన అర్థమును స్పష్టముగావింతురు. అవి 1.జహల్లక్షణ 2.అజహలక్షణ 3. జహదజహల్లక్షణ.

79. 1. జహల్లక్షణకు 'గంగాయాంఘోషః " (గంగలో గొల్లపల్లె)- అనునది ఉదాహరణము. గంగానదిలో గొల్లపల్లె ఉండుట అసంభవము గనుక 'గంగలో గొల్లపల్లె' అను పదములను వదలివేసి 'గంగా తీరమునందలి గొల్లపల్లె' అనునది ముఖ్యార్థముగా గ్రహింపబడుచున్నది.

2. అజహల్లక్షణకు “నల్లనివి ఉన్నవి, ఎఱ్ఱనివి పారిపోయినవి" అనునది ఉదాహరణము. ఒకేచోట నల్లని ఆవులు, ఎఱ్ఱని గుఱ్ఱములు ఉన్నపుడు "ఎఱ్ఱనివి పారిపోయినవి" అనుపదముల వలన 'ఆవులున్నవి, గుఱ్ఱములు పారిపోయినవి' అను ముఖ్యార్థము వచ్చును. ఇక్కడ ఏ పదములను వదలివేయలేదు.

3. జహదజహలక్షణకు "సో 2 యం దేవదత్తః" (అతడే ఈ దేవదత్తుడు) - అనునది ఉదాహరణము. ఈ మూడు లక్షణావృత్తులను సముచితముగా ఉపయోగించుట ద్వారా పలు శాస్త్రగ్రంథభాగములందు బయటకు కనిపించు విరోధములు తొలగింపబడుచున్నవి.

ఇక్కడ మూడవదిమాత్రమే ఉపయుక్త మగును.

80. 'అతడే ఈ దేవదత్తుడు'- అను ఉదాహరణమునందు, వేరొక ప్రదేశమున వేనొక సందర్భమున చూడబడి 'దేవదత్తుడు' గా తెలియబడిన వ్యక్తి ఈ ప్రదేశమున ఈ సందర్భమున చూడబడిన వ్యక్తియే. దేశ, కాలములు భిన్నము లయినను కొంచెము ఆలోచించినచో ఆ వ్యక్తి ఒక్కడే అని స్పష్టమగును.

81. అదే విధముగా 'తత్త్వమసి' అను మహావాక్యములోని 'తత్-త్వం' పదములకు 'ఈశ్వరుడు-జీవుడు' అను వాచ్యార్థములను వదలివేసి, వానికి సంబంధించిన చైతన్యతత్త్వమును గ్రహించి 'తత్' అనుపదమునకు బ్రహ్మచైతన్యమనియు, 'త్వం' అను పదమునకు సాక్షిచైతన్యమనియు ముఖ్యార్థములుగా గ్రహింపవలెను. వీని యొక్క అవిచ్ఛిన్నమయిన ఐక్యమును 'అసి' (అయి ఉన్నావు) - అను క్రియాపదము నిరూపించుచున్నది. తత్ఫలితముగా బ్రహ్మమే ఆత్మ అనియు, ఆత్మయే బ్రహ్మమనియు స్పష్టమగుచున్నది.

82. ఘట జలమునందు ప్రతిఫలించిన ఆకాశము, మేఘమునందు ప్రతిఫలించిన ఆకాశము*--రెండును ఆగంతుకములు (నడుమ వచ్చినవి) గనుక అసత్యములు, కానీ ఘటములోని ఆకాశము, మహాకాశము ఒక్కటే; వానిమధ్య ఎట్టి భేదము లేదు. అదే విధముగా సర్వవ్యాపకమయిన బ్రహ్మము, జీవునిలోని సాక్షి రెండును ఒక్కటే. నీవు దీనిని అనుభవగోచరము గావించుకొనవలెను, తత్ఫలితముగా, 'నేను తత్త్వము (బ్రహ్మము)గా ఉన్నాను'- అను అనుభవములో నీవు స్థిరముగా ఉండవచ్చును.

83. దీనిని విన్నతరువాత గురుని ఉపదేశములపట్ల దృఢ విశ్వాసముగల ఆ శిష్యుడు పంచకోశములను, శూన్యమును నిరాకరించి, 'అహం బ్రహ్మాస్మి' (నేను బ్రహ్మమే) అని ఆత్మను అనుభవగోచరము గావించుకొని, దానికి అతీతుడయి పరిపూర్ణ సత్ స్వరూపుడుగా నున్నాడు.

84. అనుగ్రహస్వరూపుడగు గురుని దృష్టిపాతముతో యోగ్యుడయిన ఆ శిష్యుడు ఆనంద సాగరమున మునిగి, పరిణతమగు మనస్సుతో శరీరేంద్రియాది సర్వ విషయ విముక్తమయిన శుద్ధ చైతన్యముగా, అవిభక్తమయిన పరిపూర్ణ వస్తువుగా లీనుడయి, అతడు జాగరూకుడయి కూడ ఏమియు ఎఱుగక యథార్థ మయిన ఆత్మ అయినాడు.

ఆకాశము దృశ్యముకాదు. కానీ మేఘములున్న ప్రదేశము మన దృష్టిలో ప్రత్యేకముగానుండును. అందువలన అది మేఘములందు ప్రతిఫలించిన ఆకాశము అని చెప్పబడినది.

85. ధన్యుడయిన ఆ శిష్యుడు ఆ స్థితిలో చాల కాలము ఉన్న తరువాత అతని మనస్సు మెల్లగా బహిర్ముఖమయినది. పిదప అతడు తన యెదుట నున్న మహాత్ముడగు తన గురువును దర్శించినాడు. అతని కనులు ఆనందబాష్పపూర్ణము లయినవి. అతడు ప్రేమతో గురుచరణములకు ప్రణమిల్లి లేచి గురువునకు ప్రదక్షిణము గావించి చేతులు జోడించి ఆయనతో ఇట్లు పలికినాడు:-

86. "ప్రభూ! అసంఖ్యాకములయిన నా పూర్వజన్మ లన్నింటిలోను నన్ను పాలించు నా అంతరాత్మగా నున్న సద్వస్తువు మీరే. నాకు ఉపదేశింపవలెనను ఉద్దేశముతో బాహ్యరూపమును ధరించిన మీకు జయమగుగాక! నాకు మోక్షమును ప్రసాదించిన మీ అనుగ్రహఋణమును ఎట్లు తీర్చుకొనవలెనో నాకు తెలియకున్నది. మీ పావన పాదములకు జయము! జయము!

87. ఆ సద్గురువు ప్రసన్న వదనముతో శిష్యుని దగ్గరకు తీసికొని మిగుల ప్రేమతో ఇట్లు పలికినాడు:- "నీ అనుభవమును అడ్డగించు త్రివిధములయిన అవరోధములు లేకుండా ఆత్మయందు స్థిరముగా ఉండుటే నీవు నాకు ఈయగల అత్యుత్తమయిన ప్రతిఫలము".

88. "ప్రభూ! 'నీవు', 'నేను' అను ద్వైతదృష్టిని అతిక్రమించి ఆత్మ సంపూర్ణము, సర్వవ్యాపకము అని తెలిసికొన్న నా యీ ఆత్మానుభవము ఎప్పుడయినను తొలగగలదా?"

అపుడు గురువిట్లు బదులుపలికినాడు:- "అహం బ్రహ్మాస్మి- అను సత్యము శాస్త్రములవలన గానీ, గురుని అనుగ్రహమువలనగానీ తెలియబడును. కానీ అది, అవరోధము లున్నపుడు, స్థిరముగా ఉండజాలదు. దిండు

89. అసంఖ్యాకములయిన పూర్వజన్మలలో చిరకాలముగా నున్న అభ్యాసముల (వాసనల) వలన అజ్ఞానము, సంశయము, మిథ్యాజ్ఞానము- అను మూడు ఆటంకములు కలుగును; ఇవి కష్టమును కలిగింపగా ఆత్మసాక్షాత్కారఫలితములు తెలియకుండా జాఱిపోవును. అందువలన, శ్రవణ-మనన-నిదిధ్యాసనములతో ఆ ఆటంకములను నిర్మూలింపుము.

90. మంత్ర ప్రయోగములతో నిరోధింపబడిన (స్తంభించిన) అగ్ని వస్తువులను దహింపదు. అదేవిధముగా దోష యుక్తమయిన ఆత్మసాక్షాత్కారము బంధమును అంతమొందింపదు. కావున నీవు తత్త్వము యొక్క శ్రవణ, మనన, నిదిధ్యాసనములను శ్రద్ధగా అనుష్టించి అజ్ఞానమును, సంశయమును, మిథ్యాజ్ఞానమును నిర్మూలింపుము.

91. అజ్ఞానము, ఆత్మ బ్రహ్మమను సత్యమును కప్పిపుచ్చి, దానికి మాఱుగా నానాత్వమును ప్రదర్శించును; గురువచనములయందు దృఢమయిన విశ్వాసము లేకపోవుట వలన గలుగు సంభ్రమమే సంశయము; అశాశ్వతమయిన ప్రపంచము సత్యమనియు, దేహము ఆత్మ అనియు కలుగు భ్రాంతియే న మిథ్యాజ్ఞానము - అని యీ విధముగా జ్ఞానులు చెప్పుచున్నారు.

92. 'తత్త్వమసి' మొదలగు మహావాక్యముల ప్రబోధమును మాటిమాటికి మనఃపూర్వకముగా వినుట శ్రవణము. అప్పటికే విన్న శాస్త్రవాక్యముల అర్థమును వివేకముతో అనుసంధానము చేయుట మననము. మనస్సుయొక్క యేకాగ్రత ఇంక నిదిధ్యాసనము. ప్రతిదినము నీవు వీనిని అభ్యసించినచో తప్పక మోక్షమును పొందగలవు.

93. జ్ఞాత (తెలిసికొనువాడు), జ్ఞానము (తెలిసికొనుట) అను బుద్ధి ఉన్నంతకాలము ఈ అభ్యాసమును కొనసాగింపవలెను. ఆ తరువాత ఎట్టి ప్రయత్నము అక్కర లేదు. ఆకాశమువలె నిర్మలమును, స్వచ్ఛమును, శాశ్వతము నయిన చైతన్యముగా నుండి జీవించియుండగానే ముక్తుడయిన వ్యక్తి ఎల్లప్పుడు- దేహపాతానంతరముగూడ- అది (బ్రహ్మము)గానే జీవించును.

94. ఆకాశమువలె నుండి జీవన్ముక్తులయిన జ్ఞానులు పుణ్యము ననుసరించి నాలుగు విధములుగా నుందురు. వారు:
1. బ్రహ్మవిదులు,
2. బ్రహ్మవిద్వరులు 3. బ్రహ్మవిద్వరీయులు,
4. బ్రహ్మవిద్వరిష్ఠులు.

95. దృఢమయిన అభ్యాసముతో స్పష్టముగా బ్రహ్మసాక్షాత్కారమును పొందిన బ్రహ్మవిదులు స్వయముగా తమ పరమస్థితినుండి తొలగకుండా పరులప్రయోజనము (లోకానుగ్రహము) కొఱకు శాస్త్రములు నిర్దేశించిన విధముగా కచ్చితముగా తమ వర్ణాశ్రమ ధర్మముల అనుష్టానమును గూడ కొనసాగింతురు.

96. రాగ ద్వేషాదిమనోవికారములు ఆవిర్భవించినచో వెంటనే అదృశ్యమగును; అవి, తామరాకుమీది నీటివలె సంగరహితులయి సమాజములో జీవించు ఆ బ్రహ్మవిదుల మనస్సును కళంకితము గావింపజాలవు.వారు తమ జ్ఞానమును బయటకు ప్రదర్శింపకుండా అజ్ఞానులవలె కనిపించుచు అంతర్గతమయిన ఆనందాతిశయమువలన మౌనముగా ఉందురు.

97. పూర్వజన్మల యందలి చర్యల ననుసరించి వారిలో (బ్రహ్మవిదులలో) ప్రారబ్ధము భిన్నముగా నుండును. కావున ముక్తులయిన జ్ఞాను లందరిలో ప్రస్తుత ప్రవృత్తులు గూడ భిన్నములుగా నుండును. వారు తపస్సు చేయవచ్చును; లేక వాణిజ్యవ్యాపారములలో నిమగ్నులు కావచ్చును; లేక రాజ్యమును పాలింపవచ్చును; లేక భిక్షుకులుగా పరిభ్రమింపవచ్చును.

98. వారు గతమునుగూర్చికానీ భవిష్యత్తును గూర్చిగానీ ఆలోచింపరు; అయాచితముగా వచ్చిన దానిని అనుభవింతురు; సూర్యుడు చంద్రుడుగా మారినను, లేక ఎట్టి అద్భుతము జరిగినను, ఆకాశము మజ్జిచెట్టువలె ఊడలను వ్యాపింపజేసినను, లేక శవము మరల జీవించినను ఆశ్చర్యపడరు; మరియు వారు మంచి-చెడులను వేఱుగా జూడరు, ఏల అనగా, వారు ఎల్లప్పుడు సమస్తమునకు నిర్వికారసాక్షులుగా ఉందురు.

99. మిగిలిన ముగ్గురిలో బ్రహ్మవిద్వరుడు, బ్రహ్మవిద్వరీయుడు సమాధి నిష్ఠులయి ఉందురు.

బ్రహ్మవిద్వరుడు శరీర సంరక్షణపట్ల ఆసక్తి జూపును (అనగా ఆహారాదులకొఱకు స్వయముగా సమాధినుండి మేల్కొనును). బ్రహ్మ విద్వరీయుడు ఆహారాదులకొఱకు అన్యులచే మేల్కొల్పబడును. బ్రహ్మవిద్వరిష్ఠునకు స్వయముగా గానీ, అన్యుల ద్వారా గానీ ఎన్నడును శరీరముయొక్క ఎఱుక ఉండదు.

100. ప్రపంచములో చాల అరుదుగా నుండు వివిధ జ్ఞానుల జీవితములలో విభిన్నలక్షణము లున్నప్పటికీ, వారి మోక్షానుభవములో ఏ మాత్రము భేదము లేదు.

అట్లయినచో కష్టపడి సంపాదించిన సమాధి యొక్క ఉపయోగమేమి? బాహ్యమున క్రియాశీలుడుగా నున్న బ్రహ్మవిదుడు ఆపదలవలన గలుగు దుఃఖమును అనుభవించుచున్నట్లు కొన్ని సమయములలో కనిపించును, కానీ మిగిలినవారు అవిచ్ఛిన్నమయిన ఆనందములో నుందురు.

101. ఇక బ్రహ్మవిదులు అజ్ఞానులవలె జీవించినచో వారు జన్మచక్రమునుండి ఎట్లు విముక్తు లయినారు? వారి అజ్ఞానము ఎట్లు నశించినది? సర్వవ్యాపకమయిన ఆకాశము దేనిచేతను కళంకితము కాకుండా ఉండును; ఇతర భూతములు నాలుగు, వస్తుసంపర్కముచేత కళంకితములగును. బ్రహ్మవిదుని యొక్కయు, అజ్ఞాని యొక్కయు విషయము గూడ అంతే.

102. పావనుడగు జ్ఞానిపట్ల నెఱపిన ఏక మనస్కమయిన భక్తి బ్రహ్మ-విష్ణు- మహేశ్వరులను సంతోషపెట్టుటయే కాక సమస్త వైదిక కర్మల వలన గలుగు ఫలితములను సంపాదించిపెట్టి, చివరకు జన్మ చక్రమునుండి విముక్తిని ప్రసాదించునని సనాతనములయిన వేదములు ప్రకటించుచున్నవి.

జీవించి యుండగా లభించిన మోక్షము దేహపాతానంతరముగూడ ఎట్లు నిలిచియుండునో ఇపుడు వినుము.

103. అనేక జన్మలలో కూడబెట్టిన బహువిధమయిన సంచిత కర్మ, గొప్ప కారు చిచ్చులో దూది వలె, జ్ఞానాగ్నిలో పూర్తిగా దగ్ధమగును. ఆగామికర్మలు (జ్ఞానానంతరము చేసిన కర్మలు) జ్ఞానిని ఎన్నటికిని స్పృశింపజాలవు. ప్రస్తుత జన్మను కలిగించిన ప్రారబ్ధకర్మ దాని ఫలితములను అనుభవించుటవలన నశించును.

104. జ్ఞాని ప్రారబ్ధమును అనుభవించు కాలమున జేసిన కర్మలవలన గలుగు పుణ్య పాపములు తరువాత ఆయనను బాధింపకుండా ఎట్లుండును? ఆయనను నిందించినవారు పాపములను పంచుకొందురు, ఆయన భక్తులు పుణ్యములను పంచుకొందురు.

105. అజ్ఞానమయమయిన కారణశరీరము పరమజ్ఞానాగ్నిలో భస్మమగును దృశ్యమగు స్థూల శరీరము కాలక్రమమున శవ మగును; పిదప సూక్ష్మ శరీరము, ఎఱ్ఱగా కాలిన ఇనుము మీది జలబిందువువలె త్రివిధ శరీరములకు (స్థూల, సూక్ష్మ, కారణ శరీరములకు) ఆధారమయి ఇంతకాలము సంపూర్ణముగానున్న ఆత్మలో విలీనమగును.

106. కుండ అను వస్తువు పగులగానే ఆ కుండలోని ఆకాశము సర్వవ్యాపకమయిన ఆకాశము నందు వేఱుచేయరానిదయి ఏకమగును. అదేవిధముగా శరీర పరిమితులు నశించినపుడు జీవన్ముక్తుడు

ఆది-మధ్య-అంతములు గానీ బహిరంతరములుగానీ లేని సహజము, శాశ్వతము, శరీరరహితము నయిన మోక్షస్థితికి తిరిగిపోవును.

107. ఆకాశము సర్వవ్యాపకమయినను క్రొత్తగా త్రవ్విన నూతియందు క్రొత్తగా బహిర్గతమయినట్లు కనిపించును; అట్లే బ్రహ్మము గూడ నిత్యసిద్ధమయినప్పటికి గురువు లేక శాస్త్రములు బోధించిన విధముగా ఆత్మ విచారణవలన క్రొత్తగా అనుభవగోచరమయినట్లు కనిపించును. అందువలన వత్సా! మనము ఎల్లప్పుడు పరిమితిరహితమయిన ఒకే సద్వస్తువని గ్రహించి ప్రశాంతముగా ఉండుము!

108. విశ్వమంతయు- ఎండమావులయందలి నీరువలె, ముత్యపుచిప్పయందలి వెండివలె, ఆకాశము నందలి గంధర్వనగరమువలె, స్వప్నమునందలి స్వప్నదేశమువలె, ఆకాశముయొక్క నీలవర్ణమువలె, త్రాడునందలి పామువలె, గొడ్రాలి కొడుకువలె, కుందేటి కొమ్మువలె, స్థూలమయిన స్తంభమునందలి దొంగవలె, అసత్యమే. పుత్రా! శుద్ధ చైతన్యము మాత్రమే సత్యము. అందువలన ఏ క్షణమునందయినను ఆత్మను విస్మరింపవద్దు.

ప్రథమ భాగము సమాప్తము.

# ద్వితీయ భాగము

## సందేహ నివారణము

1. "మానవులు గోతిని త్రవ్వి, దానిలో మెల్లగా పొడవయిన స్తంభమును నాటి దానిని మట్టితో నింపి ఆ స్తంభమును దృఢముగా స్థాపించుటకు రాతి ముక్కలను దట్టించి దిగగొట్టుదురు. అదేవిధముగా నేను సందేహనివారణమును చేపట్టితిని. తత్ఫలితముగా సర్వోత్తమ చైతన్యముగా ఆత్మసాక్షాత్కారము నిశ్చలముగా ఉండును."

2. నిర్మలచిత్తుడయి ఆత్మానుభవమును పొందిన ఆ శిష్యుడు దేహము ఆత్మయను మిథ్యా తాదాత్మ్యమున్న సమయమునుండి వృత్తి రహితము దేహరహితమునగు మోక్షముగలుగు క్షణమువఱకు, కోతిపిల్ల తన తల్లిని పట్టుకొనునట్లు, తన గురువును అంటి పెట్టుకొని యుండెను.

3, నీడవలె తనను వెన్నంటి యున్న ప్రియ శిష్యుని జూచి గురువు ఇట్లడిగినాడు: "వత్సా! నీవు కేవల సాక్షిగా చలింపకుండా ఉండగలుగుచున్నావా? నీ సంశయములన్నియు నశించినవా? లేక భేదబుద్ధి అప్పుడప్పుడు కలుగుచున్నదా? నీ పరిస్థితిని నాకు చెప్పుము."

4. ఈ మాటలను విన్న శిష్యుడు శ్రీ గురుచరణములకు ప్రణమిల్లి యిట్లు పలికినాడు:- "తండ్రీ! భేదభావపిశాచములు ప్రాపంచిక జీవితారణ్యమునందు అజ్ఞానాంధకారములో మాత్రమే పరిభ్రమింపగలవు; మీ ప్రబోధ భాస్కరుడు మీ అనుగ్రహ పర్వతశిఖరమున ఉదయించిన తరువాత ప్రబలమయిన ఆ విజ్ఞాన భాస్కర ప్రకాశములో ఆ పిశాచములు నా అంతర్దృష్టికి గోచరింపగలవా?

5. పిశాచములు ఆవేశించిన వానికి, ఆ పిశాచమును వదలించిన పిదపగూడ, మరల ఆ పిశాచబాధ కలుగకుండా రక్షాయంత్రము (తాయెత్తు)ను కట్టి రక్షణ కల్పింతురు; అదేవిధముగా, స్వామీ! తమ ఉపదేశముచేత నా అజ్ఞానము తొలగినప్పటికి, నేను దృఢముగా ఆత్మనిష్ఠుడ నగుటకై మీనుండి అధికముగా ప్రబోధమును అర్థించుచున్నాను.

6. ‘ఆత్మ బ్రహ్మమే- అను విషయమును శాస్త్రముల వలన తెలిసికొనుము; అద్వితీయ బ్రహ్మము వాక్కులకు (శాస్త్రాధ్యయన, చర్చలకు) గోచరము కాదు. బ్రహ్మమును హృదయము (మనస్సు) నందే అనుభవ గోచరము గావించుకొనవలెను, మందభాగ్యమయిన మనస్సునకు స్వయంప్రకాశమయిన బ్రహ్మము గోచరముకాదు'- అని తాము దయతో చెప్పినారు. ఈ రెండు వచనముల విషయమున నాకు సందేహములున్నవి. దయతో వానిని తొలగింపుడు."

7. గురువు: "బ్రహ్మము ఇంద్రియములకు గానీ, అనుమానమునకు గానీ గోచరమగు విషయము కాదు గనుకను, అద్వితీయము గనుకను, ప్రత్యక్ష- అనుమాన- ఉపమానము లను త్రివిధప్రమాణములకు అతీతమయినది. మరియు బ్రహ్మము నిరుపాధికము (జాతి, గుణాదిరహితము) అగుట వలన దానిని వాక్కులు వివరింపజాలవు.

8. బ్రహ్మము వాక్కులకు అతీతమని ఉదోషించిన వేదములే 'తత్త్వమసి' మొదలగు వాక్యములచేత బ్రహ్మమును సూచించుచున్నవి. వీనిలో ఏది సత్యము అని అడిగినచో రెండును సత్యములే అని తెలిసికొనవలెను. ఏల అనగా, వేదములు ఎన్నటికిని అసత్యములు కాజాలవు.

9. స్వయంవరమునందు రాజకన్య ఇతరుల విషయమున 'ఇతడు కాడు' 'ఇతడుకాడు' అని పల్కుచు, తన ప్రియుని జూపించినపుడు సిగ్గుతో మౌనముగా నుండును. అదేవిధముగా వేదములుగూడ బ్రహ్మముకాని దానిని 'ఇది కాదు' (నేతి) 'ఇది కాదు' (నేతి) అని స్పష్టముగా నిరాకరించి బ్రహ్మమును మౌనముతో సూచించును.

10. నీ మొదటి సందేహమును తొలగించి, రెండవ సందేహమును గూడ తొలగించుచున్నాను. హృదయము బాహ్యమయిన ఇంద్రియములను శాసించును, దాని శక్తులు బుద్ధిగాను మనస్సుగాను, అంతర్గతముగా బాహ్యముగా క్రీడించును (పనిచేయును).

11. నీ ముఖము అద్దములో ప్రతిబింబించి కనిపించును. అట్లే శుద్ధచైతన్యము యొక్క ప్రతిబింబము (చిదాభాసము) బుద్ధిలో కనిపించును. దీనితో గూడి మనస్సు పనిచేయ నారంభించును. ఇది జ్ఞానము అనబడును.

12. కరగించిన లోహము మూసలో పోయబడి ఆ మూస యొక్క ఆకారములను ధరించును. అట్లే మనస్సు వస్తువుల ఆకారములను ధరించును. ఇక ఆ వస్తువులు ప్రతిబింబిత కాంతితో వ్యక్తములగును. కంటి చూపు, వెలుగు లేకుండా చీకటిలో వస్తువులు కనిపింపజాలవు.

వివరణము: కాంతి చీకటిని తొలగించును. కానీ వస్తువు కంటితో చూడబడును. అదే రీతిగా మనోవృత్తులయిన వస్తువులు, మనస్సు యొక్క ప్రతిబింబిత కాంతితో ప్రకాశింపజేయబడును.

13 చీకటిలోని వస్తువును కనుగొనుటకు వెలుగుచున్న దీపపు సాయము, స్వచ్ఛమయిన కంటి చూపు ఆవశ్యకము లగును. కానీ సూర్యుని చూచుటకు కంటి చూపు ఒక్కటే చాలు. వ్యక్తప్రపంచమును జూచుటకు మనోవృత్తి, ప్రతిబింబిత కాంతి (చిదాభాసము) రెండును ఆవశ్యకములు. కానీ తత్త్వమును (బ్రహ్మమును) తెలిసికొనుటకు మాత్రము తెలిసికొనవలెనను ఆసక్తి గల మనోవృత్తి ఒక్కటే చాలు.

14. మనోవృత్తి - చిదాభాసముల సంయోగము మనస్సు అనబడును. తనవైపుకు త్రిప్పబడిన మనోవృత్తి ఆత్మసాక్షాత్కారమునకు ఆవశ్యకమను కారణమువలన మనస్సునకు బ్రహ్మము గోచరము కాగలదు. మనస్సు యొక్క చిదాభాసాంశము బ్రహ్మమును గోచరింపజేసికొనజాలదు. ఈ విధముగా ఆ అర్థమును సమాధానపఱచుకొని సందేహరహితుడవయి ఉండుము."

15. శిష్యుడు: - "సత్యజ్ఞాన స్వరూపా! పూజ్య గురుదేవా! మీ బోధమును ఇంతవఱకు అవగతము గావించుకొంటిని. మీ అనుమతితో మరియొక ప్రశ్నను అడుగుచున్నాను. మనస్సు నిశ్చలము, అవిచ్ఛిన్నము, పరిపూర్ణము అయిన బ్రహ్మ పరిణమించినది అయినపుడు అట్టి మానసిక స్థితిని సమాధియోగమని అందురు కదా! నిరంతరము

డోలాయమానమయి క్షణములో అనేక లోకములను సృజించు ఈ మనస్సును గాలితాకిడి లేని దీపజ్వాలవలె ఆత్మయందు స్థిరముగా (నిశ్చలముగా) నుండు విధముగా జేయుట ఎట్లు? దయతో నాకు తెలియజేయుడు."

16. గురువు: "క్రియాశీలమయిన మనస్సు త్రిగుణములతో గూడియుండును; వానిలో ఒకటి అత్యధికముగా నున్నపుడు మిగిలినవి రెండును గుప్తములుగా నుండును. సత్త్వగుణముతో దైవగుణములు (దైవీసంపద) వ్యక్తమగును; రజోగుణముతో ప్రపంచమునకు, దేహమునకు, శాస్త్రములకు సంబంధించిన ప్రవృత్తులు (లోకవాసన, దేహవాసన, శాస్త్రవాసన) వ్యక్తమగును. తమోగుణముతో దుష్టప్రకృతి (ఆసురీసంపద) వ్యక్తమగును.

17. సత్త్వమే యథార్థమయిన మనస్స్వరూపము, కానీ మిగిలినవి రెండును కేవలము అనుబంధములు (ఆరోపితములు); అందువలన వానిని మనస్సునుండి " తొలగింపవచ్చును.

వ్యక్తి స్థిరముగా తన దివ్యత్వమును నిలుపుకొన్నచో రజస్తమస్సులు అణగిపోవును, తత్ఫలితముగా అంతర్గతమయిన ఒత్తిడులు, బాహ్యమయిన విషయబాహుళ్యము అదృశ్యమగును. ఇది జరిగినపుడు నీ మనస్సు నిర్మలముగా ప్రకాశించుచు ఆకాశమువలె సూక్ష్మమయి నిశ్చలమగును. ఇక తరువాత, పూర్వమే బ్రహ్మముగా నున్నమనస్సు సహజముగా బ్రహ్మముతో ఏకమయి భేదరహితశాంతిలో (నిర్వికల్ప సమాధిలో) ఉండును.

18. ఒక నిర్మలమయిన అద్దమును మరియొక నిర్మలమయిన అద్దము ఎదుట ఉంచినపుడు వానిలో ప్రతిఫలించు ఉపరితలములు ఏకము, అవిభాజ్యము నగు పూర్ణముగా ఉండును. అదేవిధముగా స్వచ్ఛమయిన మనస్సు అనంతము, సచ్చిదానందమునగు బ్రహ్మముతో ఏకమయి నిర్మలముగా నున్నపుడు ఆ మనస్సునందు విషయబాహుళ్యముగానీ చలనములు గానీ ఎట్లుండగలవు? చెప్పుము."

19. శిష్యుడు:- "జీవన్ముక్తులయిన జ్ఞానుల మనస్సు బ్రహ్మములో విలీనమయి దానితో ఏకమయినపుడు ఆ జ్ఞానుల ప్రారబ్ధము ఎట్లు నశింపగలదు? ప్రారబ్ధము, దాని ఫలితమును అనుభవించి నపుడే, నశించునుగదా? అట్టి అనుభవమునకు తప్పక మనస్సు ఆవశ్యకమగును. మనస్సు లేనపుడు ఎట్టి అనుభవము ఉండ జాలదు. మనస్సు నిలిచియున్నచో ఆ జ్ఞానులు ముక్తులని ఎట్లు గు? ఈ విషయమున నేను కలవరపడుచున్నాను. దయతో నా యీ సందేహమును నివారింపుడు. ఏల అనగా, నా సందేహము లన్నియు తొలగనిదే నేను ముక్తుడను కాజాలను.

20. గురువు: జ్ఞానుల (ముక్తుల) మనోనాశము రెండు విధములుగా ఉండును:

1. సరూపనాశము 2. అరూపనాశము. వీనిలో మొదటిది జీవన్ముక్తులకు సై అన్వయించును; రెండవది విదేహముక్తులకు అన్వయించును.

సత్త్వగుణమును మాత్రమే నిలిపి రజ, స్తమోగుణములను తొలగించుట మనస్సు యొక్క సరూపనాశ మగును. సూక్ష్మదేహముతోగూడ సత్త్వము " అదృశ్యమయినపుడు మనస్సే నశించినదని చెప్పబడుచున్నది. ఇది a అరూపనాశము.

21. సత్త్వము స్వచ్ఛమై, మనస్స్వభావము తానే అయి ఉండును; మనస్సునకు రూపమునిచ్చు రజస్తమస్సులు, తగిన అభ్యాసముతో నశించినపుడు 'మనస్సు' అను పదము యొక్క గుర్తింపు నశించును, అనగా, మనశ్శబ్దార్థము నశించును.

ఏల అనగా అట్టి స్థితిలో జ్ఞానులు తమకు అయాచితముగా లభించిన దానిని అనుభవింతురు; భూత, భవిష్యత్తులను గూర్చి ఆలోచింపరు; సంతోషముతో పొంగిపోరు, దుఃఖముతో క్రుంగిపోరు. వారు కర్తృత్వభావనను అతిక్రమించి అకర్తలగుచు మనోవృత్తులను జాగ్రత్- స్వప్న-సుషుప్తిరూపమగు అవస్థాత్రయము సాక్షిమాత్రులయి చూచుచు

ప్రారబ్ధమును " అనుభవించుచున్నను ముక్తులుగా ఉండగలరు. దీనిలో అసంగతమయిన విషయ మేదియు లేదు. ఈ విషయమున నీకు ఎట్టి సందేహములు ఉండ నవసరము లేదు.

22. ముక్తుల క్రియాశీలసమయమంతయు సైతము శాంతిస్థితియే- అని విన్న తరువాత, "కర్మ, మారుచున్న మనస్సును సూచించుట లేదా? అట్టి మార్పు కలుగునపుడు శాంతి జారిపోదా?"- అని నీవు ఆక్షేపింపవచ్చును. దీనికి " సమాధానము ఇది:-

"జ్ఞాని స్థితి- తన గృహకృత్యములను జేయుచున్నప్పటికి, తన విటుని పట్ల ప్రేమతో పులకించు స్త్రీ స్థితివంటిది."

23. శిష్యుడు: "శరీర సంగతులకు (స్థూల సూక్ష్మ శరీరములకు, వర్ణాశ్రమ ధర్మాదులకు) అతీతుడయి, జీవన్ముక్తుడయి, కర్తృత్వభావనను సంపూర్ణవ్యక్తిత్వమును గోల్పోయి, బ్రహ్మముతో ఏకమయిన జ్ఞాని ప్రారబభోక్త అని చెప్పినచో, ఆయన కర్తగూడ అయితీరవలెను. సంపూర్ణముగా అకర్త అయినవ్యక్తికి భోగము ఉండగలదా? సకలదుఃఖనివారణకుశలా! గురుదేవా! దయతో దీనిని వివరింపుము.

24. గురువు: "పరమకర్తలు, పరమభోక్తలు, పరమత్యాగులు నగు వారిగొప్పతనమును వినుము. సూదంటు పోయి అయిన కొండ స్వయముగా కదలదు, దేనిని కదలించదు. అయినను ఇనుపముక్కలు స్వయముగా ఆ పర్వతమువైపు ఆకర్షింపబడును. అదేవిధముగా నేను స్వయముగా దేనిని చేయను, ఇతరులను చేయుడని ప్రేరేపించను; అయినప్పటికి నా యెదుట ప్రపంచమంతయు క్రియాశీలముగానుండును. దేహేంద్రియాదుల యొక్క సమస్త వ్యాపారములకును, బ్రహ్మమునందు మనస్సు లీనమగుట వలన గలుగు శాంతిస్థితికిని నేను, సూర్యునివలె, ఉదాసీనుడయిన సాక్షిగా ఉందును. దృఢమయిన ఈ అనుభవము కల వ్యక్తి పరమకర్త లేక మహాకర్త.

25. అప్రయత్నముగా తనకు లభించిన ఏ ఆహారమునయినను అది రుచికరమయినను కాకున్నను, శుద్ధమయినను మలినమయినను, ఆరోగ్యకరమయినను అనారోగ్యకరమయినను తన దారిలో నున్న సమస్తమును దహించు మహాగ్నివలె- భేదము చూపకుండా భుజించువాడు పరమభోక్త లేక మహాభోక్త.

గొప్పవయినను కొద్దివయినను, మంచివయినను చెడ్డవయినను, స్వీయములయినను పరకీయములయినను, నశ్వరములయిన సుఖదుఃఖాది అవస్థలచేత బాధింపబడకుండా స్ఫటికమువలె నిర్మలయిన మనస్సు గలవాడు పరమత్యాగి లేక మహాత్యాగి.

ఈ మూడు సుగుణములు గల ముక్తుడగు జ్ఞానియే యథార్థముగా ఆదర్శము."

26. శిష్యుడు: 'ప్రపంచమున పనిచేయుచు, మోక్షకాంక్షగల యితరులను తృప్తిపఱచుటకై బోధించుచు ప్రారబ్ధవశమున దేహధారి అయి జీవించు జ్ఞాని కృతకృత్యుడని యెట్లు పరిగణింపగలము? గురుదేవా? ఎంతో అనుగ్రహముతో తాము నా దుఃఖకారణమును తొలగించితిరి, దయతో నాకు సమాధానము చెప్పుడు."

27. గురువు: మానవుల ప్రవృత్తులు మూడు విధములుగానుండును: 1. భోగేచ్ఛ, మమత్వ బుద్ధి, దేహాసక్తికల అజ్ఞానులకు ఇహలోక -పరలోకములకు సంబంధించినప్రవృత్తులుండును. 2. మోక్షమును గాఢముగా కాంక్షించువారు మాత్రమే తత్త్వజ్ఞానాదుల వైపు తిరుగుదురు. 3. ఇక పరమసిద్ధిని పొందిన వ్యక్తికి జ్ఞానమువలనగానీ అట్టి అన్యచర్యల వలనగానీ పొందవలసినది ఏది అయినను ఉండునా?

28. శిష్యుడు: గురుశిరోమణీ! నా దొక మాట యున్నది. బుద్ధి పూర్వకముగా ఐహిక- ఆముష్మిక జీవిత సుఖములను పరిత్యజించినవారు మాత్రమే యథార్థమయిన విజ్ఞానమును అభ్యసింపగల రనుట యుక్తము. మోక్షమార్గమున బోవుటకై ప్రాపంచిక వ్యవహారములనుండి, విధ్యుక్త కర్మలనుండి తొలగియున్నవారు ఎప్పుడయినను మరల పూర్వ

పద్ధతులవైపు తిరుగగలరా? మనస్సును దృఢము గావించుటకు శ్రవణ, మనన, నిదిధ్యాసనములు ఆవశ్యకములు కావా? నాకు యథార్థమును చెప్పుడు.

29. గురువు: బుద్ధిశాలీ! తెలియనివారు శాస్త్రములు, సద్గురువులు బోధించిన విధముగా శ్రవణము చేసి తత్త్వమును తెలిసికొనవలెను; సందేహములు కలవారు మననములో నిమగ్నులు కావలెను; మిథ్యాజ్ఞానముయొక్క వశమున ఉన్నవారు నిదిధ్యాసనమును అభ్యసింపవలెను. యథార్థము, ఆకాశతుల్యము నగు సచ్చిత్సిద్ధిరూపుడు అయిన వారికి ఎట్టి కొరత అయినను ఉండగలదా?

30. శిష్యుడు: "స్వామీ! జ్ఞానులు గూడ అజ్ఞానుల వలె, 'నేను చేసితిని-నేను చూచితిని-నేను భుజించితిని-నేను వెళ్ళితిని' అని యీ విధముగా అనగలరా? వారు మిథ్యాజ్ఞానరహితులని తాము చెప్పుచున్నారు. సత్యమగు బ్రహ్మ, సాక్షాత్కారము అట్టి మాటలకు అవకాశ మీయగలదా? దయతో ఈ విషయమును నాకు విశదము గావింపుడు."

31. గురువు: "స్వప్నమునుండి మేల్కొన్న వ్యక్తి స్వప్నమునందలి తన అనుభవమును గూర్చి మాట్లాడును. అదేరీతిగా ఆత్మసాక్షాత్కారమును పొందిన జ్ఞాని కూడ అజ్ఞాని భాష నుపయోగించుచున్నప్పటికి అహంభావ బద్ధుడు కాడు. తాను అమరుడయిన దేవత అగు సందర్భమున అగ్నిజ్వాలలకు ఆహుతియగు మానవుడు తన దేహము భస్మమగునంతవఱకు మానవుడుగానే చెప్పబడును. అదేవిధముగా అహంభావరహితుడగు జ్ఞాని కూడ తాను దేహరహితుడగువఱకు ఇతరులవలె పనిచేయుచున్నట్లు కనిపించును.

32. శిష్యుడు: సద్గురూ! అట్లయినచో విషయములు అసత్యములయినను వానితో సంబంధముగల వ్యాపారములు దుఃఖమును గలిగింపవా? అవి జ్ఞానానందము నీయగలవా? ఆ వ్యాపారములు లేనపుడే ఆనందము అనుభూతము కాగలదు. కనుక ఏకాగ్రముగా నుండుట ఆవశ్యకము కాదా? ఇక ఏకాగ్రతను అభ్యసించునెడల, ఆయన కృతకృత్యుడనగలమా?

33. గురువు: వత్సా! ఆత్మజ్ఞానీ! ప్రారబ్ధము అంతమొందినపుడు వ్యాపారములు అంతమొందును. సమాధియొక్క అభ్యాసముగానీ ప్రాపంచిక కార్యముగానీ మనోవ్యాపారము కాదా? జ్ఞాని సర్వోత్తమ మయిన ఆత్మతో ఏకముగా ఉండుట వలన ఆత్మకంటె వేఱయిన దేనినయినను చేయగలడా? ఆఱు విధములయిన సమాధులలో దేనినయినను అభ్యసింపవలసి యున్నచో ఆయన ఆత్మనిష్ఠుడని చెప్పజాలము.

34. శిష్యుడు: "పరమగురువర్యా! ఆత్మనిష్ఠులయి కర్తవ్యమేమియు లేనివారిలో కొందరు మనస్సును నిగ్రహించు నిదిధ్యాసనములను ఎందుకు అభ్యసించుచున్నారు?

గురువు: జీవయిన జ్ఞానులు తమ ప్రారబ్ధము ననుసరించి అనేకవిధముల క్రియాశీలురుగా ఉన్నట్లు కనిపింతురని ఇంతకుముందే నీకు నేను చెప్పియున్నాను.

35. ప్రియ పుత్రకా! నేను ఇంకను చెప్పుచున్నాను, వినుము. జ్ఞాని యొక్క వ్యాపారములు కేవలము ప్రపంచోద్ధరణము కొఱకే. వాని వలన ఆయనకు నష్టముగానీ లాభముగానీ లేదు. ప్రపంచము పట్ల కేవలము అనుగ్రహనిధియగు సర్వేశ్వరుని సృష్ట్యాదులవలన గలుగు పుణ్యములు గానీ పాపములుగానీ అంటవు.

36. శిష్యుడు: "గురుదేవా! పారమార్థికముగా రూపరహితులగు మీరు జగత్సంబంధముగా ఈశ్వరునిగా పనిచేయుచు ఇక్కడ మానవరూపములో కనిపించుచున్నారు. జ్ఞాని, ఈశ్వరుడు ఒక్కరే అని మీరు చెప్పుచున్నారు. వారు సమానులెట్లగుదురు?"

గురువు: "అవును. ఈశ్వరుడు, జ్ఞాని ఒక్కరే; ఏల అనగా, వారు 'అహంకార', 'మమకార' రహితులు. జ్ఞానిస్వయముగా ఈశ్వరస్వరూపుడు, సర్వజీవస్వరూపుడు, విశ్వరూపుడు గూడ."

37. శిష్యుడు: "ప్రభూ! మీరు చెప్పిన విధముగా జ్ఞాని సర్వజీవస్వరూపుడయినచో ఆయన ముక్తుడయినపుడు ఇతరులు బద్ధులుగా ఎట్లుండగలరు? జీవులు 4 భిన్ను లన్నచో ఆయన అందరుగా ఉండజాలడు. సర్వజ్ఞ గురుదేవా! నా యీ ప్రశ్నకు సవివరముగా సమాధానము జెప్పుడు.

38,39. గురువు: "అందరిలో "నేను, నేను" గా ప్రకాశించు ఆత్మ సంపూర్ణము, అవిభాజ్యము. కానీ అహంభావరూపములో నున్న ఉపాధులు ఎట్లు భిన్నములో జీవులు గూడ అట్లే భిన్నులు. ప్రపంచమును ఆనందింపజేయు చంద్రుడు ఒక్కడే, కానీ కొలనులు, గుంటలు, చెఱువులు, ప్రవాహములు, తొట్లు, నీటికడవలు ఎన్ని ఉండునో అన్ని చంద్రబింబము లుండును. వానిలో ఒకటి నశించినపుడు చంద్రబింబము ఇక దానిలో ప్రతిఫలింపక దాని మూలమగు చంద్రునిలో తిరిగి లీనమగును. కానీ ప్రతిఫలించిన యితర ప్రతిబింబములు అట్లు నశించి చంద్రునిలో లీనములు కాజాలవు. అదే విధముగా ఉపాధులు నశించిన జీవుడు తన మూలమగు ఆత్మలో విలీనుడగును గాని ఇతర జీవు లట్లు విలీనులు కారు."

40. శిష్యుడు:- "విశ్వము యొక్క సృష్టి, స్థితి, లయములకు ప్రభువులగు బ్రహ్మ, విష్ణు, శివులుగా నుండు ఈశ్వరుడు, జ్ఞాని ఒక్క రెట్లు కాగలరు? ఆ త్రిమూర్తులు ఇతరుల ఆలోచనలను గ్రహింపగలరు; భూత, భవిష్యద్వర్తమానములను తెలిసికొనగలరు; సర్వాంతర్యాములు గూడ, మహాతపస్సంపన్నుడవయిన గురుదేవా! ఈ గుణముల గుర్తు గూడ జ్ఞానిలో నాకు కనిపించుటలేదు."

41. గురువు: "చెఱువునీరు, శక్తిమంతమయిన పెద్దదీపము మొత్తము గ్రామమునకు సాయపడును. కానీ ఒక నీటికుండ, ఒక చిన్నదీపము ఒకయింటిలోని కుటుంబమునకు సాయపడును. జ్ఞాని సాంగత్య సహితా! వత్సా! "అహం బ్రహ్మాస్మి" - అను విజ్ఞాన విషయమున ఈశ్వరునకును, జ్ఞానికిని భేదములేదు. అయినను మాయాకల్పితములయిన ఉపాధుల సంబంధమువలన వారు అధికులుగా అల్పులుగా చెప్పబడుచున్నారు.

42. మానవులలో రాజులు, మరియు సిద్ధులు వలనే దేవతలలో నారాయణుడు మొదలయినవారు తమ అసాధారణమయిన పూర్వకృత తపస్సులవలన అణిమాదుల వంటి కొన్ని అసాధారణ శక్తులను పొందినారు. మానవులకు ఈ శక్తులు లేకపోయినందువలన అల్పులుగా కనిపించినప్పటికి బ్రహ్మదృష్టి ననుసరించి వారి మధ్య స్వల్పమయిన భేదము కూడ లేదు.

వివరణము: - దూరస్థములుగానీ గుప్తములుగానీ అయిన భూత, భవిష్యద్విషయములనన్నింటి యొక్క జ్ఞానమును సంపాదించినవారు సిద్ధులు; వారు ఇతరుల ఆలోచనలను గ్రహింతురు; గజబలమును పొందుదురు; సింహపరాక్రమమును పొందుదురు; వాయువేగమును పొందుదురు; నీటిలో తేలుదురు; భూమిలోనికి ప్రవేశింతురు; ఒక్క దృష్టిపాతముతో సర్వలోకములను సందర్శింతురు, మరియు అన్యములయిన అపూర్వములగు అద్భుతకృత్యముల నాచరింతురు.

అణిమ మొదలగు శక్తులు ఎనిమిది. అవి యివి:-

1. అణిమ: అతి స్వల్పరూపమును ధరించుట.

2. మహిమ: అతి స్థూల దేహ మగుట.

3. లఘిమ: మిగుల తేలిక అయి గాలిలో తేలుట.

4. గరిమ: అధికమయిన బరువు లేక అనివార్యమయిన సంకల్పము (నీటిలోనికి పోయినంత తేలికగా భూమిలోనికి పోవుట)

5. ప్రాప్తి: కోరిన ప్రతివిషయమును సాధించు సామర్థ్యము.

6. ప్రాకామ్యము: అవయవములను అపరిమితముగా ప్రసరింపజేయు శక్తి (అంగుళ్యగ్రముతో చంద్రుని స్పృశించుట)

7. ఈశత్వము: చేతన- అచేతనములగు సమస్త వస్తువుల మీద అధిపత్యము.

8. వశిత్వము: ఇంద్రియ విజయము లేక ప్రకృతి క్రమమును మార్చు శక్తి.

43. శిష్యుడు: “నాకు మోక్షమును అనుగ్రహించిన గురుదేవా! అణిమాదులయిన ఈ అసాధారణ శక్తులు గల జ్ఞానులు ఈ ప్రపంచమునందు ఎందరో ఉన్నప్పటికి ఈ శక్తులు ఈశ్వరునకు సంబంధించిన వని మీరు చెప్పుచున్నారు. ఈ విషయము నాకు వివరింపుడు"

గురువు: “మహిమాన్వితుడు, సర్వశక్తి సంపన్నుడు నయిన పరమాత్మ పట్ల భక్తివలనను, తమ తపస్సులవలనను, యోగాభ్యాసములవలనను వారికి ఈ శక్తులు లభించినవని తెలిసికొనుము.

44. శిష్యుడు: “శివస్వరూపా గురువర్యా! ఈ శక్తులు, మోక్షము గూడ తపస్సు యొక్క ఫలిచో అపుడు పూర్వఋషుల కున్నట్లుగా సర్వజ్ఞానులకు ఈ రెండును ఉండవలెను. ప్రాచీన ఋషులకు ఈ సిద్ధు లున్నవనియు,వారు మోక్షమును గూడ పొంది రనియు మేము తెలిసికొంటిమి. జ్ఞానులందరికి అట్టి శక్తులు గూడ ఎందుకులేవు?”

45. గురువు: "తపస్సు రెండు విధములు: 1. సకామము 2. నిష్కామము. వీనిలో మొదటిది కోరిన శక్తులను ప్రసాదించును, రెండవది విజ్ఞానమును ఇచ్చును. ఒక్కొక్కటి తనకు ప్రత్యేకముగా నిర్ణయింపబడిన ఫలితములను ఈయగలదు. అది నియమము. పూర్వఋషులు స్పష్టముగా రెండు విధములయిన తపస్సులను ఆచరించినారు.

46. జనకుడు, మహాబలి, భగీరథుడు తదితరులు మోక్షమును మాత్రమే పొందిరి. వారు ఏ సిద్ధుల నయినను ప్రదర్శించిరా? లేదు. జ్ఞానులలో కొందరు సిద్ధులను మాత్రమే కోరిరి; ఇతరులు సిద్ధులను, మోక్షమును రెండింటిని కోరిరి. ఈ సిద్ధులు కేవలము ప్రదర్శనమునకు మాత్రమే, అంతకంటె అధికముగా ఉపయోగకరములు కావు. అవి మోక్షమును ఈయవు.”

47. శిష్యుడు: "జీవ బ్రహ్మైక్యరూపమగు ఆత్మానుభవమునకు మోక్షమే ఏకైక ఫలమయినచో ఈలోకమునందే ముక్తులయిన జ్ఞానులలో కొందరు (యోగవాసిష్ఠములో పేర్కొనబడిన చూడాల వంటివారు సిద్ధులప్రాప్తికొఱకు) ఏల ప్రయత్నించినారు?"

గురువు: “ప్రారబ్ధము సుఖ, దుఃఖానుభవరూపమగు తన ఫలితములను ఇచ్చినపిదప మాత్రమే నశించును. అందువలన ముక్తులయిన జ్ఞానులు పొందిన సిద్ధులు ప్రారబ్ధము యొక్క ఫలితము లనియే భావింపవలెను."

48,49. శిష్యుడు: "గురుదేవా! తాము ఎంతో అనుగ్రహముతో నా ప్రశ్నలన్నిటికి పావనములగు వేదవాక్యములతోను, తర్కముతోను సమాధానముల నిచ్చితిరి, తత్ఫలితముగా నా మనస్సు నిశ్చలముగా నున్నది. నేనిపుడు మనోభ్రాంతులనుండి ముక్తుడనయి నిర్మలముగా, స్వచ్ఛముగా నున్నాను. లోహదర్పణము పూర్వమే నిర్మలముగా నున్నను దానిని కొంచెము అధికముగా శుభ్రపఱచుటలో వాస్తవముగా ఎట్టి హానియులేదు.

నా దుఃఖనివారకుడవయిన ప్రభూ! అమృతతుల్యములయిన మీ మాటలను ఎంతగా విన్నను తృప్తికలుగుటలేదు. వేదములు పూర్తిగా సత్యముకాని దేని నయినను చెప్పగలవా? 'ఏ వ్యక్తి కర్మ అయినను తన ఫలితములను ఇచ్చిన

పిదప మాత్రమే నశించును- శుద్ధమయిన జ్ఞానాగ్ని అనంతరకాలమున ఫలించుటకు సిద్ధముగా నున్న కర్మను (సంచితకర్మను దగ్ధము గావించును'- ఈ రెండు శాస్త్ర వాక్యములను నేనెట్లు సమన్వయింపగలను?"

వివరణము: మనోభ్రాంతులు అయిదు. 1. ప్రపంచము సత్యము. 2. శరీరమే నేను. 3. నేను కర్తను, భోక్తను, 4. నేను సర్వేశ్వరునికంటె భిన్నుడను 5. శుద్ధచైతన్యము "నేను" (అహం) కాదు, శివుడే.

50. గురువు: "వత్సా! జీవులు తమ సంఖ్యా, సామర్థ్య, జాతులను బట్టి అపరిమితముగా ఉన్నారు. అదేవిధముగా వారి చర్యలు గూడ అపరిమితములే. శ్రేయోదాయకములయిన వేదములు సాధకుల యోగ్యతలను అనుసరించి కర్మ-ఉపాసనా- భక్తిమార్గములను నిర్దేశించినవి. పూల ననుసరించి పండ్లు కలుగునట్లుగా ఈ ప్రాథమిక దృక్పథములననుసరించి వాని అంతిమ సిద్ధాంతము లుండును.

51. పాపులు నరకములలో బాధపడవలసిన వారయినను పుణ్యములయిన దానములు,మంత్రములు, తపస్సులు, యజ్ఞములు మొదలగువాని వలన ఆ నరకములనుండి రక్షింపబడగలరు- అను విషయము సత్యముకాదా? జ్ఞానాగ్ని ఫలింపనున్న సమస్త సంచిత కర్మలను నశింపజేయును -అను వేదవాక్యమునందు విశ్వాసముగల వ్యక్తి మోక్షమును పొందును."

52. శిష్యుడు:"నా హృదయమందిరమునందు నిరంతరము నివసించు ప్రియతమ గురువర్యా! అనేక జన్మలలో సంచితమయి యున్న కర్మను యథార్థ విజ్ఞానము _ నిర్మూలించి వ్యక్తిని ముక్తుని గావింపగల్గినచో అత్యంత మేధావంతులుగూడ ఈ విజ్ఞానముతో లాభమును పొందక కర్మగర్తము (కర్మ అను గుంట)లోపడి ఎందుకు శించుచున్నారు. దయతో వివరింపుడు."

53. గురువు: "కుమారా! అంతర్ముఖమయిన మనస్సుకలవారు, అనగా నానాత్వమును మాయామయ దృశ్యముగా జూచుచు బ్రహ్మమే ఏకైక సత్యమని భావించువారు, శాశ్వతమయిన ఆ తత్త్వమును (బ్రహ్మమును) అనుభవగోచరము గావించుకొందురు. తమ కోర్కెలను నెరవేర్చుకొనుటకొఱకు బహిర్ముఖమగు మనస్సుగలవారు, తమ కనులను తెఱచికూడ ముఱికి గుంటలోపడు అజాగరూకులయిన పాదచారులవలె, క్షుద్రమయి ఎన్నటికిని అంతమొందని పునర్జన్మ సముద్రమున బడి మోక్షమును పొందజాలరు."

54. శిష్యుడు: "సత్కర్మలు, దుష్కర్మలు ఈశ్వరునిచే ప్రేరేపింపబడినవి కావా?

తేజా స్వయముగా ఈశ్వరునిచే సృజింపబడిన జీవులు ఏమి చేయగలరు? పూజ్యగురువరా! వారిని ఎట్లు నిందింపగలము?"

గురువు: "వత్సా! నా మాట వినుము! ఇవి వేదముల అర్థమును స్పష్టముగా నెఱుగని మూఢుల భ్రాంతివచనములు.

55. సర్వ శక్తి సంపన్నుడగు పరమేశ్వరుని సృష్టి, జీవసృష్టి భిన్నములుగా నుండును. సర్వేశ్వరుని సృష్టి జగత్సంబంధమయినది, చరాచరములతో గూడినది. సంగములు, మనోవికారములు, కోరికలు మొదలగు వానితో గూడిన అయోగ్యమయిన జీవసృష్టి అహంకారమునకు సంబంధించినదే కాని నిశ్చితముగా ఈశ్వరునిది కాదు.

56. త్రివిధముగా, అనగా, సృష్టి-స్థితి-లయ కారకుడుగా పనిచేయు సర్వసమర్థుడగు ఈశ్వరుని సృష్టి మోక్షమునకు ఉపాయమును ఏర్పరుప వచ్చు, కానీ జీవుల సృష్టులు వారికి పునర్జన్మ పరంపరలను గలిగించుచు క్లేశదాయకములుగా నుండును. సృష్టి అంతమొందినను, ఎవ్వనికిని, జనించు లక్షణము అంతమొంది మనోవికారాదుల పరిత్యాగానంతరమే నశించును.

57. ఈశ్వరసృష్టియొక్క ప్రళయసమయము నందు గూడ ఎవరు పునర్జన్మలనుండి విముక్తులయినారు? ఎవ్వరును ముక్తి పొందలేదు. కానీ దేశ-కాలములు, దేహములు నిలిచియున్నను, జీవసృష్టిభ్రాంతిని నశింపజేసి జ్ఞానమును పొందుటవలన వ్యక్తులు ఈ లోకమునందే ముక్తులయి ఉన్నారు. అందువలన బంధము, భ్రాంతి స్పష్టముగా జీవుడు స్వయముగా కల్పించుకొన్నవే కానీ ఈశ్వరుడు కల్పించినవి కావు.

58. అశ్వత్థామను ఒక వృక్షము కలదు. దానిమీద రెండు పక్షులు నివసించుచున్నవి. యద వానిలో ఒకటి వాంఛాసహితమయి 'ఇది మధురము- ఇది మధురము' అని పల్కుచు ఫలములను అనుభవించుచున్నది. అత్యంతపూజ్యమయిన రెండవ పక్షి ఆ వృక్షఫలములను భుజించుట లేదు. ఈ దృష్టాంతకథను అవగతము జేసికొనుము. దీనిద్వారా పవిత్రమయిన వేదము జీవేశ్వరులను వర్ణించుచున్నది.

వివరణము: ఈకథ ముండకోపనిషత్తులో కనిపించుచున్నది. దేహము క్రిందపడునది గనుక వృక్షముతో పోల్చబడినది. దానిమూలములు పయిని పరబ్రహ్మములో నుండును. దాని కొమ్మలు ప్రాణవాయు ప్రభృతులుగా క్రింద ఉండును. దాని స్థితి నిశ్చితముగా నిరూపింప వీలుగానిది గనుక అశ్వత్థము (అనగా, అవిశ్వసనీయము) పవిత్రమయిన రావిచెట్టుగా చెప్పబడినది. దాని ఉనికి అజ్ఞాన సహవర్తిగనుక సందిగ్ధము. తమ కర్మఫలములను అనుభవించుటకు జీవులకు శరీరము అవసరమగును. అందువలన శరీరము క్షేత్రమని చెప్పబడినది. ఈ నివాసస్థానమునందు అహంకారము, విశ్వాత్మ అను రెండు పక్షులు నివసించును. అవి క్రమముగా భోక్తగా, ఉదాసీన సాక్షిగా ఉండును.

59. తమ అజ్ఞానమువలన తాము కల్పించుకొన్న కామ- క్రోధ- లోభ- మోహ- మద-మాత్సర్య రూపమగు అరిషడ్వర్గమును భగవంతునకు ఆరోపించు మూర్ఖులు అనర్థమును పొందుదురు. కానీ ఆ ఆరు దుర్గుణములు తాము కల్పించుకొన్నవి గానీ భగవంతుడు కల్పించినవి కావని గుర్తించిన జ్ఞానులు అకళంకమయిన మోక్షము పొందురు.

60. శిష్యుడు: "ఆనందస్వరూపా! గురువర్యా! పక్షపాత రహితుడగు భగవంతుడు. కొద్ది మందిని అభివృద్ధిని పొందించి యితరులను ఎందుకు భ్రష్టులను గావించుచున్నాడు?

గురువు: "సరి అయిన మార్గములోనున్న తన కొడుకులను ప్రోత్సహించుచు, చెడుమార్గములోనున్న ఇతరపుత్రులను కోపించి గద్దించు తండ్రివంటివాడు భగవంతుడు. తప్పుచేయువారిని శిక్షించి మంచివారినిగా మార్చుట దయ అని తెలిసికొనుము.

61. ప్రాపంచిక బంధవిచ్ఛేదము గావించిన వత్సా! కల్పవృక్షము, అగ్ని, జలము తమ్ము అభ్యర్థించిన వారి కోర్కెలను నెరవేర్చి, వెచ్చదనమును గల్గించి, దప్పిక దీర్చి వారిని రక్షించుచున్నవి. అదే విధముగా ఈశ్వరుడు తన భక్తులపట్ల దయాళువ ఉండును. ఇతరుల యెడల అట్లుండడు. ఆ తప్పు ఎవరిదో " ఇప్పుడు చక్కగా విచారించి నిర్ణయింపుము.

62. కుమారా! ఇపుడు ప్రధానమయిన విషయమును వినుము. శాస్త్రములలో భగవంతుడు చూపిన మోక్షమార్గమును పట్టుదలతో అవలంబించి, జ్ఞానులను అనుసరించి, తన దుష్టప్రవృత్తులను పరిత్యజించి, నిత్యానిత్యములను వివేచించి, అజ్ఞానజనితమయిన భ్రాంతిని తిరస్కరించి, ఆత్మసాక్షాత్కారము ద్వారా విజ్ఞానమును పొందినవానికి పునర్జన్మలు అంతమొందును.

63. ఈ విజ్ఞానము చాలకాలము నిరంతరముగా ఆత్మవిచారమును అభ్యసించుటవలన లభింపగలదు."

శిష్యుడు: "ఈ విచారము ఎట్టిది?"

గురువు: "మనస్సు, ఇంద్రియాదులతో గూడిన దేహమునందలి ఈ 'నేను' ఎవరు? చైతన్యమనగా ఏమి? జడ మనగా ఏమి? బంధ మనబడు వాని సంయోగమెట్టిది? మోక్ష మనగా ఏమి? ఈ ప్రశ్నలను విమర్శించుటయే విచారము.

64. శిష్యుడు: "పూర్వజన్మల యందలి సమస్తపుణ్యకర్మల యొక్క సంచితఫలము మనకు జ్ఞానమును ప్రసాదించును. ఇక ఆత్మవిచారమునకు ఆవసరము ఏమున్నది?"

గురువు: "నామాట వినుము! భగవంతునకు సమర్పింపబడిన నిస్స్వార్థకర్మలు మాలిన్యములను తొలగించి మనస్సును స్వచ్ఛము గావించుటకు సాయపడును. ఆ విధముగా నిర్మలమయిన మనస్సు ఆత్మ విచారణ జేయ నారంభించి జ్ఞానమును పొందును."

65. శిష్యుడు: "పూజ్యగురుదేవా! శాస్త్రోక్తకర్మలు, భక్తిని గలిగించు ఇతరములయిన శక్తిమంతమగు కర్మలు, వైరాగ్యము, పరలోకసుఖము, అప్రాకృతశక్తులు, తపస్సులందు నిశ్చలత్వము, యోగవిజయము, ధ్యానము, దైవరూపము- వీటన్నిటికి భ్రాంతిని తొలగించు సత్యజ్ఞానమును ఇచ్చుట సాధ్యము కాదా? విచారణకు గూడ అవసరమేమి ఉన్నది?

66. గురువు: "వత్సా! నామాట వినుము! మాఱు వేషములోనున్న వ్యక్తులను నీవు గుర్తింపగోరినచో వారి స్వభావమును, ఇప్పుడు గుప్తముగానున్నవారి అభ్యాసములను, లక్షణములను నీవు తెలిసికొనుటకు తగు చర్యలను చేపట్టుదువు. కానీ దానికి భిన్నముగా నీవు అటునిటు పరుగిడి, దుమికి, తలక్రిందుగా ఎగిరి కాళ్ళపయి వ్రాలి, మొగ్గవేసి, స్తంభము సెక్కి, నృత్యముచేసి అంతట గడబిడచేసినచో, అది, వారిని గుర్తించుటకు నీకు సాయపడదు.

67. అదేవిధముగా విచారణ మాత్రమే వేదములు వ్యక్తముగావించిన జ్ఞానమును కలిగింపగలదు; వేదములు గూడ పరోక్షముగానే బ్రహ్మమును నిర్దేశించుచున్నవి. వేదాధ్యయనమువలన, ఆకలి గొన్నవారికి ఆహారమిచ్చుటవలన, తపశ్చర్యవలన, మంత్రోచ్చారణవలన, సత్ప్రవర్తనవలన, యజ్ఞముల వలన, అట్టి అనేకములగు అన్యవిషయముల వలనను ఆత్మజ్ఞానము లభింపజాలదు.

68. శిష్యుడు: "శుద్ధజ్ఞానస్వరూపా! గురుదేవా! ప్రకాశమానమయిన (పూర్వకాలపు) లోహదర్పణము (అద్దము) మీది మఱకను తోముటవలన మాత్రమే తొలగింపగలము. అట్లు కాక ఎవ్వరయినను జ్ఞానముతో మాత్రమే ఆ దర్పణమును నిర్మలముగా చేయగలిగినారా? అదే విధముగా అజ్ఞాన మాలిన్యమును కర్మతో తొలగింపవలెను. కానీ కేవలము మానసికమయిన జ్ఞానముతో దానిని తొలగింపగలుగుట ఎట్లు? నాకు చెప్పుడు."

69. గురువు: వత్సా! లోహదర్పణము మీది చిలుము (మాలిన్యము) భౌతికము. అది దానికి సహజము గూడ, కానీ స్ఫటికము మీద భాసించు నలుపు దానికి సహజము కాదు. ఆ నలుపు స్ఫటికము మీద కేవలము ఆరోపింపబడినది. అద్దము మీద మాలిన్యమును తొలగించుటకు తగిన కార్యము నిస్సందేహముగా అవసరమే. కానీ స్ఫటికము మీది నలుపు ఆరోపణమని తెలిసికొనుటకు మనస్సు మాత్రమే సమర్థమగును.

వివరణము: ఇక్కడ, తన వెనుక రంగురేకు గల స్వచ్ఛస్ఫటికము ప్రసరింపజేసిన రంగుతో అజ్ఞానమును గురువు పోల్చుచున్నారు.

70. ఇక్కడ గూడ శూన్యము, జడత్వము, దుఃఖము అన్నియు సచ్చిదానందము మీద మాయాక్రీడచేత ఆరోపింపబడుచున్నవి. అవి సహజములుగానీ సత్యము అవిద్య (అజ్ఞానము) నశ్వరమయినను దానికి ర్మపరంపర విరుద్ధము కాదు; అంతేకాక ఆ కర్మపరంపర అజ్ఞానమును పోషి (ఆత్మసాక్షాత్కారము) కర్మను, అజ్ఞానమును దహించు అగ్ని.

71. తాను తన వస్తువులను ఇంట్లో ఎక్కడనో పెట్టి మఱచిన వ్యక్తి నూరేండ్లు విలపించినను వానిని తిరిగి పొందజాలడు. కానీ అతడు ఆ విషయమును గూర్చి ఆలోచించి కనుగొన్నచో వానిని పొందగలడు. దుఃఖమున కంతటికీ మూలకారణమయిన మఱపును (అజ్ఞానమును) నశింపజేయు జ్ఞానమువలన ప్రత్యక్షముగా ఆత్మ అనుభవగోచరమగును. కానీ యుగముల పర్యంతము ఎన్ని కఠిన కర్మల నాచరించినను ఆత్మ అనుభవగోచరము కాజాలదు.

72. శిష్యుడు: "సద్గురూ! జ్ఞానమే పరమానందమునకు ఏకైక కారణమని చెప్పు వేదము కర్మకాండమునందు కర్మను పుణ్యముగాను, పాపముగాను, ఉభయమిశ్రమముగాను వర్గీకరించి, ఆ కర్మలను ఆచరించువారు క్రమముగా దేవతలుగా, పశువులుగా (మృగములు, పక్షులు, చెట్లు, కీటకములు మొదలగునవిగా) జన్మించునట్లు చేసి, మరియు మానవుల యొక్క విభిన్న వర్ణాశ్రమములకు ప్రత్యేకమయిన విధులను నిర్దేశించి, వానిని సక్రమముగా జేసినపుడు సుఖమును ఇచ్చుచున్నవి. వేదములు ఇట్లు విరుద్ధముగా ఎందుకు చెప్పుచున్నవి?"

73. గురువు: "మట్టి దిన్న తన బిడ్డ యొక్క రోగము పట్ల కలత జెందిన ప్రియజనని ఆ బిడ్డను బుజ్జగించుచు ఔషధమిశ్రితమయిన మధురపదార్థమును వానికి ఇచ్చును. 'నీ గృహకృత్యములను జేయుము, యజ్ఞములను ఆచరింపుము, అవి అన్నియు మంచివి'- అను వేదముల ప్రోత్సాహకవాక్యములు గూడ అట్టివే. కానీ వాని భావము విభిన్నమయినది. అది స్వర్గసుఖము గోరు వారికి అవగతము కాదు.

74. సుఖమును గోరువారు తమకు లభించిన దానిని భుజించుట, తమకు నచ్చిన స్త్రీని భోగించుట సహజమే. ప్రతివ్యక్తియు తనకు స్వభావసిద్ధమయిన దానిని చేయవలయునని వేదములు శాసించునా? వానికి ఆ మాత్రము తెలియదా? 'కాకీ! నల్లగా ఉండుము! అగ్నీ! కాల్చుము! వేపచెట్టూ! చేదుగా ఉండుము! వేగవంతమయిన మారుతమా వీచుము!- అని ఎవ్వరును ఆజ్ఞాపింప నక్కరలేదు.

75. నీకు మద్య, మాంసములయందు ఆసక్తి ఉన్నచో వానిని యజ్ఞములను జేసి భక్షింపుము. నీకు కామవాంఛ ఉన్నచో నీ భార్యను అనుభవింపుము' - అని వేదములు ఆదేశించుచున్నవి. మానవుడు తన కోరికలను ఇతర మార్గములద్వారా తీర్చుకొనుటను మానుకొనవలెనని వేదము ఆశించుచున్నది. సంపూర్ణమయిన వాంఛిత్యాగమే వేదముల లక్ష్యము."

శిష్యుడు: అట్టి యెడల అసలు ఈ విధులు ఎందు కుండవలెను?

గురువు: "అవి ప్రాథమికములు (పూర్వపక్షములు) మాత్రమే కాని అంతిమములు (సిద్ధాంతములు) కావు.

76. 'మద్యమును త్రాగుము, మాంసమును భుజింపుము'- అని చెప్పిన వేదమే తరువాత 'దానిని ఆఘ్రాణింపుము' అని అన్నది. సంతానము కొఱకు మాత్రమే .. భార్యను భోగిము'- అను విధిని గూడ గ్రహింపుము. 'దీనిని గూడ (అనగా, యజ్ఞమును, వివాహమును, సంపదను, ఇతరము లయిన ఆస్తులను) పరిత్యజింపుము'- అను ఆదేశమును గూడ గమనింపుము, మరియు, సంపూర్ణ త్యాగము సన్న్యాసికి గానీ బ్రహ్మచారికి గానీ కళంకము కాదని గ్రహింపుము. ఈ ప్రణాళికను సంపూర్ణముగా అర్ధముజేసికొని ఎట్టి కర్మాసక్తి నయినను పరిత్యజించినచో నీవు మోక్షమును పొందగలవు."

77. శిష్యుడు: "గురుదేవా! ప్రపంచావిర్భావమునకు కారణమయిన అజ్ఞానమునకు కర్మలు కేవలము సహాయకారులు- అను విషయమును అంగీకరించుచున్నాను;

అయినను జ్ఞానము ఈ నానాత్వమును గలిగించు అజ్ఞానమునకు విరుద్ధమయినచో అట్టి అజ్ఞానము, చంద్రునిలో మచ్చవలె, నిర్మలమయిన జ్ఞానముతో కలిసియుండి ఎట్లు ఈ సృష్టిని కలిగించు చున్నది."

78. గురువు: వత్సా! స్వయంప్రకాశమయిన జ్ఞానమునకు రెండు దశలున్నవి: 1. శుద్ధ జ్ఞానము- స్వరూపజ్ఞానము. 2. వృత్తిజ్ఞానము. మొదటిది రెండవదిగా అభివ్యక్తమగును, కావున అవి పరస్పరవిరుద్ధములుకావు. గాఢనిద్రలో, శుద్ధజ్ఞానము అజ్ఞానమునకు విరుద్ధముకాదని నీవు తెలిసికొనియున్నావు. శుద్ధజ్ఞానము మీద ఆధారపడియున్న అజ్ఞానమును వృత్తి జ్ఞానము దహించివేయును."

వివరణము: సర్వవ్యాపకమయి, నిశ్చలమయిన జ్ఞానము స్వరూపజ్ఞానము.

నిర్దిష్టమయిన లేక ప్రత్యేకమయిన జ్ఞానము వృత్తిజ్ఞానము. స్వరూపజ్ఞానమును ఇంధనములో గూఢముగా నున్న దాహకశక్తితోను, వృత్తిజ్ఞానమును ఇంధనమును భస్మముచేయుచు మండుచున్న అగ్నితోను పోల్చవచ్చును. అంతేకాక ఆ రెండింటిని క్రమముగా విద్యుత్తంత్రిలో అవ్యక్తముగానుండు విద్యుత్ప్రవాహముతోను, గాజు దీపము (bulb) యొక్క సన్నని యీనె (Filament) లో వెలుగుగా వ్యక్తమగు విద్యుత్ప్రవాహముతోను పోల్చవచ్చు.

79. శిష్యుడు: “కొలిమితిత్తివలె విస్తరించి ముడుచుకొనిపోవు మాయ (అజ్ఞానము) శుద్ధ జ్ఞానముతో బాధింపబడకుండా ఉండి వృత్తి జ్ఞానముతో ఎట్లు దహింపబడగలదు?”

గురువు: "సూర్యుడు సర్వప్రపంచమునందు ప్రకాశించుచు దానిని పోషించుచున్నప్పటికి సూర్యకాంతమణియందు అగ్ని అయి దహించును. అదేవిధముగా సమాధియందు వృత్తి జ్ఞానము అజ్ఞానమును దహించివేయును.

80. శిష్యుడు: కర్మలలో మనో-వాక్-కాయ వృత్తులన్నియు చేరును గదా? వృత్తి జ్ఞానము అంతఃకరణము (మనస్సు) యొక్క వ్యాపారము కాదా? అట్టి యెడల కర్మ (ప్రత్యేకమయిన మనోవృత్తి) అజ్ఞానమును నశింపజేయునని చెప్పరాదా? అది జ్ఞానమును అద్భుత నామముతో ఎందుకు వేఱుచేయబడినది? దీనిని నాకు వివరింపుడు."

81. గురువు: “వృత్తిజ్ఞానము నిజముగా మనోవృత్తియే. కానీ ఒకే తల్లి యొక్క కొడుకులు తమలో తాము పోట్లాడుకొనుటను మనము చూచియున్నాము.

కర్మలు కర్తకు సంబంధించినవి. కానీ విచారము వలన గలిగిన జ్ఞానము ఆ వ్యక్తికి సంబంధించినది కాదు. అనగా, పురుషతంత్రము (కర్తకు అధీనమయినది) కాదు,అది వస్తువుకు-జ్ఞేయవస్తువుకు -సంబంధించినది, అనగా వస్తుతంత్రము,

82. విధులను చేయవచ్చును, చేయకపోవచ్చును లేక వేఱుగా చేయవచ్చును.' కానీ పరమజ్ఞానము అట్టిది కాజాలదు.

'అహం బ్రహ్మాస్మి' - వంటి ధ్యానము విచారముచే లభించిన జ్ఞానముకంటె నిశ్చితముగా విభిన్నమే. ఒక వస్తువును మరియొక వస్తువుగా గ్రహించుట ప్రయత్న పూర్వకమయిన యోగము. ప్రత్యక్షజ్ఞానము మాత్రమే సత్యము కాగలదు. కాల్పనికములయిన భావనలతో మోసపోకుము.

వివరణము: 1. నిర్గుణబ్రహ్మధ్యానము గూడ నిర్దేశించిన విధముగా జేయవచ్చు, వదలివేయవచ్చు, లేక వ్యక్తి యిచ్ఛానుసారము చేయవచ్చు. ఆ ధ్యానము, జ్ఞానము జ్ఞేయవస్తువునకు సహజమయినట్లు, మానవునకు సహజముకాదు.

2. అనేక విధములయిన ధ్యానములున్నవి. అట్టి ఒక ధ్యానములో శంఖ, చక్ర, గదా, పద్మధారి అయి చతుర్భుజుడగు విష్ణువును సూచించుటకై సాలగ్రామము ఉద్దేశింపబడినది. ఈ ధ్యానము ప్రయత్నకృతమయినను ఫలప్రదమే.

3. ప్రత్యక్షజ్ఞానమనగా అనుభవముతో లభించిన జ్ఞానము.

83. జ్ఞానము ప్రత్యక్షానుభవ ఫలితము, కానీ ధ్యానము విన్నటువంటి ఒక వస్తువు " యొక్క మానసిక కల్పనమాత్రమే. ఇతరులవలన విన్నది స్మృతినుండి చెరగిపోవును, కానీ అనుభవగోచరమయినది అట్లు చెరగిపోదు. అందువలన అనుభవగోచరమయినది మాత్రమే సత్యము. కానీ ధ్యానింపబడిన విషయములు సత్యములు కావు. జ్ఞానము అజ్ఞానమును కనిపించగానే నశింపజేయును, కానీ కర్మ నశింపజేయదు.

84. అసత్యధ్యానము సత్యమయిన అంతిమమయిన మోక్షమును ప్రసాదింపగలదను విషయమును సందేహింపవద్దు. నా మాట వినుము! వినికిడివలన ధ్యానింపబడు విగ్రహము ధ్యానసమయములో సత్యముకాదు, కానీ రూపము ధరించి ప్రత్యక్షముగా కనిపించినపుడు అది సత్యమగును.

వివరణము: ధ్యానదశకు జెందిన 'అహం బ్రహ్మాస్మి' అనునది సత్యముకాదు కానీ ధ్యానమువలన గలుగు 'అహంబ్రహ్మాస్మి' అనుభవము మాత్రము సత్యమని తాత్పర్యము.

85. అసత్యధ్యానము సత్యము, శాశ్వతమునయిన మోక్షమును ఎట్లు కలిగించును? - అని నీవు అడిగినచో దానికి సమాధానము ఇది:- ప్రతివ్యక్తి తన పూర్వ జన్మ యొక్క అంతిమ భావనను అనుసరించి తిరిగి జన్మించును. వ్యక్తులు తాము ధ్యానించు రూపములలో మరల పుట్టుదురు. కానీ ఏ విధమయిన పునర్జన్మ నయినను నశింపజేసికొనవలెనను ఉద్దేశముతో వ్యక్తి ఆత్మను ధ్యానించినచో అపుడు అతడు ఆత్మ అగును. ఇది నిశ్చితము, సంశయ రహితము."

86. శిష్యుడు: “మానవరూపధారివగు గురుదేవా! గుణరహితమయిన (అనగా, సర్వాతీతమయిన) బ్రహ్మను ధ్యానించువారు ఆ నిర్గుణబ్రహ్మ మయినచో విచారమునకుగానీ జ్ఞానమునకుగానీ అవసరమేమున్నది?"

గురువు: “బ్రహ్మధ్యానము వినికిడి మీద ఆధారపడినది అనగా పరోక్షము; అయినను, అది కాలక్రమమున అనుభవసత్యమగును. ఈ అనుభవము శాశ్వతమయిన విచారము, అజ్ఞానమును నశింపజేయు జ్ఞానము లేక మోక్షము అనబడును. ఇది అంతిమ నిర్ణయము, అనగా సిద్ధాంతము”

87. శిష్యుడు: “వృత్తిజ్ఞానము అజ్ఞానమును నశింపజేసిన తరువాత పరిపూర్ణమగు ఆత్మయందు శేషించియున్నయెడల అఖండానుభవసిద్ధి ఎట్లు ఉండగలదు?"

గురువు: “చిల్లగింజపొడి నీటియందలి మాలిన్యమును అడుగునకు దీసికొని పోయి దానితో కలిసి అట్లే అక్కడ నిలిచిపోయినట్లు, వృత్తి జ్ఞానము కూడ అజ్ఞానమును నశింపజేసి దానితో తానుగూడ నశించును.

88. శిష్యుడు: "మంచిది, జీవన్ముక్తులయిన జ్ఞానుల స్వభావము ఎట్టిది?

గురువు: "వారు ఆలోచనారహితులుగనుక వివాదాస్పదుడుగాని ప్రభువువలెగానీ శిశువువలె గానీ ఆనందముగా నుందురు. వారికి బంధ-మోక్షభావములు 1 పూర్తిగా అదృశ్యమగును. ఆ మేరకు వారు, అట్టి విషయములను గూర్చి మాట్లాడువారిని జూచి పరిహసింతురు. ఏల అనగా, దోమ ఆకాశమును మ్రింగి వెడలగ్రక్కిన దని చెప్పువారిని జూచి జనులు పరిహసింపరా?

89. గొడ్రాలి కొడుకు, స్థాణువు *లోని జనుడు కలిసి ఆకాశమున సేకరింపబడిన పుష్పములను ధరించి గంధర్వనగరమునందు ముత్యపుచిప్పలోని వెండి ధర విషయమున జగడమాడి కుందేటికొమ్ములను ఆయుధములుగా ధరించి యుద్ధము చేసి ఒకరినొకరు పొడుచుకొని కలిసి మరణించి పిశాచములుగా మారిరి.

బుద్ధిమంతుడయిన వాడెవడును ఈ కథను విని కుతూహలమును పొందడు. ఇది ఒక కల్పితకథ. జ్ఞానికి ప్రపంచము, దాని వ్యవహారములు ఈ కథవంటివే.

90. మాయయే అసత్యము గనుక దాని సృష్టి అంతయు అదేవిధముగా అసత్యమయి ఉండవలెను. సంతానము తల్లికంటె భిన్నముగా ఉండగలదా? అందువలన స్వర్గమునుగానీ నరకమునుగానీ, మంచినిగానీ చెడునుగానీ లక్ష్యపెట్టకుండా సచ్చిదానంద పూర్ణమగు ఆత్మగా ఉండుము.”

91. శిష్యుడు: "ప్రభూ! పద్మాసనుడగు బ్రహ్మ, తదితరదేవతలు, ప్రపంచములోని గొప్పవ్యక్తులు, గంగవంటి పుణ్యనదులు, తీర్థములు, పుణ్యసందర్భములు, షడంగములతో గూడిన చతుర్వేదములు, మంత్రములు, తపస్సులు- ఇవి అన్నియు అసత్యములని నిరాకరించుట దైవదూషణము కాదా చెప్పుడు?

92. గురువు: "స్వప్న దృశ్యములను అసత్యములని నిరాకరించుట దేవతాదూషణ మయినచో భ్రాంతివలన అస్తిత్వమును పొందు ప్రపంచమును నిరాకరించుట కూడా దేవతా దూషణమగును. దీనికి భిన్నముగా స్వప్న దృశ్యములను నిరాకరించుట సరి అయినచో భ్రాంతివలన పుట్టు ప్రపంచమును నిరాకరించుట సరియే అగును.

93. అసత్యమును సత్యమని భావించు అజ్ఞానులను పుణ్యపురుషులని పురాణములు భావించినచో, సత్యమును సత్యమని చెప్పినందుకు జ్ఞానిని ఏ శాస్త్రమయినను నిందించునా?

పంచభూతములుగా, విభిన్న నామ-రూపములతో గూడిన ఆ భూత వికారములుగా కనిపించు మాయ అసత్యము. సచ్చిదానందముగా

సర్వవ్యాపకమయిన ఆత్మ మాత్రమే సత్యము.

94. శిష్యుడు: "ఆచార్యా! తాము మాయామేఘములను పారద్రోలు ప్రబల ప్రభంజనమువంటి వారు. దయతో నాకు క్రింది ప్రశ్నలకు సమాధానములను జెప్పుడు:

1. మాయాస్వభావ మెట్టిది?

2. మాయావశమునం దున్నవారెవరు?

3. ఆ మాయ ఎట్లు సంభవించినది?

4. ఆ మాయ ఎందుకు ఆవిర్భవించినది?

5. మాయ బ్రహ్మముకంటె వేఱయినచో ద్వైతము అనివార్యము.

6. మాయ బ్రహ్మభిన్నము గానిచో మాయవలె బ్రహ్మమే అసత్యమగును.

95. గురువు:

1. “మాయయొక్క స్వభావము నిరూపించుటకు వీలుగానిది గనుక, అది అనిర్వచనీయమని చెప్పబడినది.

2. 'ఇది నాది, దేహమే నేను, ప్రపంచము సత్యము'- అని తలంచువారు మాయా వశమునందున్నారు.

3. ఈ గహనమయిన మాయ ఎట్లు సంభవించినదో ఎవ్వరును నిశ్చయింపజాలరు.

4. ఇది ఎందుకు ఆవిర్భవించినది అను విషయమున, వ్యక్తి విచారరహితు డగుటవలన ఇది ఆవిర్భవించినది.

96. (5), (6) : ఇంద్రజాలప్రదర్శనమునందు అనేకములయిన మాయామయ స్త్రీ జీవులు కనిపించునంతవఱకు ఇంద్రజాలికుని అవ్యక్త శక్తులు అజ్ఞాతములుగా నుండును. అదేవిధముగా బ్రహ్మముయొక్క అసంఖ్యాకములయిన

శక్తులు అజ్ఞాతములుగానే ఉండును, కానీ అవి పంచభూతముల ఆవిర్భావము " తరువాత మాత్రమే అనుమానింప (ఊహింప) బడినవి.

97. దృఢమయిన భూమిపయి నిలిచిన ఐంద్రజాలికుడు, ఆయన మాయతో కల్పించిన గుంపులు ప్రేక్షకులకు కనిపించును కానీ అతని అద్భుతమయిన మాయా ప్రతిభ అజ్ఞేయముగానుండును. అదేరీతిగా మాయా కల్పన (ప్రపంచము), మాయను ప్రయోగించిన వ్యక్తి( అనగా బ్రహ్మము) కనిపించునుగానీ మాయాశక్తి మాత్రము కనిపించదు. సర్వశక్తి సంపన్నమయిన బ్రహ్మముకంటె, ప్రపంచము కంటె భిన్నమయిన శక్తులు అనేకములున్నవి.

98. శక్తి, శక్తిప్రయోక్త (శక్తుని) కంటె వేఱుకాదు. మాయాప్రయోక్త సత్యము కానీ మాయారూపములు సత్యము కావు. బుద్ధిశాలీ! ఈ ఉదాహరణమువలన, మాయను ప్రయోగించుచునే సంపూర్ణముగాను ఆత్మగాను ఉన్న తత్త్వము (బ్రహ్మము) యొక్క యథార్థస్వభావమును నిశ్చయింపుము. ఈ విధముగా నీ సందేహమును నివారించుకొనుము."

99. శిష్యుడు: "అసత్యమయిన ఆ శక్తి ఉన్నదని ఏల చెప్పవలెను?" గురువు: "సాధుశీలా! జడములవలె కనిపించు తృణశాకాదులు ఎట్లు పుష్పించి ఫలించుచున్నవో చూడుము. చైతన్యము వీని అన్నిటిలోను వ్యాపించనిచో చరాచరములన్నియు తమ అనాది స్వభావమును గోల్పోవును.

100. అండములలోని గర్భములు అనేకవర్ణములుగల పక్షులుగా ఎట్లు వృద్ధి జెందుచున్నవో ఈ అద్భుతమును జూడుము? ఒక అదృశ్యశక్తి యొక్క శాసనము లేనిచో ప్రకృతి నియమములన్నియు రాజులేని రాజ్యమువలె విచ్ఛిన్నము లగును. అగ్ని నీరుగా మాఱును. చేదయిన వస్తువు మధుర మగును, నీచులు వేదములను పఠింతురు. నిశ్చలములయిన పర్వతపంక్తులు మేఘములవలె గాలిలో తేలును. సముద్రము లన్నియు ఎడారు లగును ఎక్కడను స్థిరత్వము ఉండదు."

101. శిష్యుడు: పరబ్రహ్మస్వరూపా! గురుదేవా! కనిపించనిది, తెలియబడనిది, ఎవ్వరును మాటలలో వివరింపరానిది, విభిన్ననామ రూపములకు మూలకారణముగా రూపొందునదియునగు ఈ మాయాశక్తిని నిర్మూలించుట ఎట్లు? అట్లు చేయనిచో మోక్షప్రాప్తికొఱకు బ్రహ్మమును అద్వయతత్త్వముగా ధ్యానించుట ఎట్లు?'

102. గురువు: "సుప్రసిద్ధములయిన అగ్ని-జల-వాయు గుణములు, రక్షాకవచముల తోను (తాయెత్తులతోను), మంత్రోచ్చారణములతోను నిరోధింపబడినపుడు, ఏమగుచున్నవి? నీవు ఇతరములగు ఆలోచనలు లేకుండా సచ్చిదానందముగా ఉన్నచో మాయ నష్టమగును. సమస్తవేద సమూహమునందును ఇతర విధానము ఏదియు కానిపింపజాలదు.

103. మట్టిలో అవ్యక్తముగా నున్నది కుండగా వ్యక్తమగుచున్నది. వ్యావహారిక జీవిత ప్రయోజనముకొఱకు (చెప్పిన) మాట (పదము) మట్టిని కుండ గావించి దానిని నశింపజేయుచున్నది. నామ-రూపములను నిరాకరించి మట్టిని గుర్తించుట యథార్థమైన జ్ఞానము. అదేప్రకారముగా, మనఃకల్పితములయిన బహుజీవభావములను నిరాకరించి ఆత్మను శుద్ధచైతన్యముగా అనుభవగోచరము గావించుకొనుము."

104. శిష్యుడు: "అసద్వస్తువు (ప్రపంచము), జడత్వము, దుఃఖము, అసత్యములయినను సంపూర్ణమగు సచ్చిదానందమునందు పట్టు విడువకుండా కనిపించుచున్నవి. వీనిని నివారించుట ఎట్లు?

గురువు: "నీటిలోని ప్రతిబింబము తలక్రిందుగా చంచలముగా కనిపించినప్పటికి నేలమీద నిలువుగా నిశ్చలముగా నున్న రూపమును జూచినప్పుడు వ్యర్థమయిన ప్రతిబింబము అసత్యముగానే ఉండును.

105. జ్ఞానము కారణము, విషయములు కార్యములు నామ-రూపములనెడి మాయా దృశ్యములు ఎట్లు పుట్టుచున్నవి, ఎట్లు అవి అదృశ్యమగుచున్నవి అని తర్కించుట వ్యర్థము.

సద్వత్సా! సుదీర్ఘమయిన ఈ ప్రపంచ మను స్వప్నము ఎట్లు కలుగుచున్నదని గానీ, ఇది ఎట్లు నశించుచున్నదనిగానీ లక్ష్యపెట్టకుండా కేవలము సర్వవ్యాపకమగు చిదాత్మగా ఎఱుక గలిగి యుండుము.

106. నీవు అసత్యవిషయముల పట్ల ఆసక్తిని వదలినకొలది తత్త్వమును (బ్రహ్మమును) గూర్చిన నీ అంతర్దృష్టి అభివృద్ధి జెందును. ఈ విధమయిన స్థిరమగు అభ్యాసముతో మనస్సు నిగ్రహింపబడి చిదాత్మగా ఎఱుక గలదయినచో నీవు దుఃఖకరమయిన శరీరమునందు జీవించుచున్నను ఆనందసాగరుడవుగా ఉండగలవు."

107. శిష్యుడు: "గురుసత్తమా! ఏకము, అద్వితీయము, సర్వవ్యాపకమునయిన ఆత్మ సచ్చిదానందముగా సర్వజీవులలోను వ్యాపించి ఉన్నదను వచనము సమంజసమని నా కనిపించుట లేదు. జీవులందరు 'నేను' అనుచున్నారు గనుక వారి సత్త స్పష్టమే; వ్యక్తమయిన జ్ఞానమువలన చైతన్యము గూడ స్పష్టమే. కానీ అదే విధముగా వారిలో ఆనందము ఎందుకు కనిపించుటలేదు?"

108. గురువు: "వత్సా! ఒకే పుష్పములో ఆకారము, సుగంధము, మృదుత్వము కలిసియున్నప్పటికి వానిలోని ప్రతి ఒక్కటి ఒక ప్రత్యేకమయిన ఇంద్రియముతోనే తెలియబడును. అట్లు కానిచో అవి కానిపింపవు; ప్రకృతి నియమము అట్టిది. అట్లే మోక్షదాయకములగు సత్త, చిత్తు, ఆనందము కలిసి ఆత్మగా రూపొందినను వృత్తులు నిరంతరము మారుచు ప్రపంచముగా గనిపించు విభేదములను గలిగించుచున్నవి.

109. కుమారా! సత్త్వ-రజస్తమస్సులనెడి త్రిగుణములు క్రమముగా శాంతి, సంక్షోభము, అజ్ఞానము అను మూడు వృత్తులను కలిగించుచున్నవి. స్వయముగా ఉత్తమములయిన సత్త, చిత్తు, ఆనందము ఎల్లప్పుడు సజాతీయమయిన మొత్తముగా ఉన్నప్పటికి భిన్నములుగా కనిపించును.

110. జడములుగాను, జ్ఞాన రహితములుగాను గనిపించు మొక్కలలోను, ఖనిజములలోను, భూమిలోను కేవల సత్త మాత్రమే కనిపించుచున్నది.

విషమువలెపనిజేయు కామమువంటి మనోవికారములతో గలిగిన సంక్షోభదశయందు ఆనందము ఉండజాలదు. కానీ ఆ దశయందు సత్త, చైతన్యము స్పష్టముగా ఉన్నవి.

బాహ్యవిషయముల యెడల తీవ్రమయిన వైరాగ్యముతో గూడిన శాంతి దశయందు సత్-చిత్- ఆనందములు కలిసి అభివ్యక్తమగును.

అందువలన అజ్ఞాన, సంక్షోభరహితమయిన ప్రశాంతిపూర్ణమయిన మనస్సునందు ఆనందము సువ్యక్తమగును."

111. శిష్యుడు: "ఈ ప్రపంచమునందు నా గురువుగా ప్రత్యక్షమయిన ప్రభూ! సచ్చిదానంద స్వరూపము స్పష్టముగా నాకు అవగతము కాలేదు. సత్ అనగా ఎట్టిది? చిత్ అనగా ఎట్టిది? ఆనందము అనగా ఏమి?"

గురువు: భూత-భవిష్యత్-వర్తమానకాలములం దెప్పుడును నశింపనిది సత్ (ఉండుట)

విభిన్న విషయములను గ్రహించునది చిత్ (జ్ఞానము) అభీష్ట విషయమును అనుభవించు సమయమున గలుగు సంతోషము ఆనందము."

112. శిష్యుడు: "మదగజము దుర్గముల పయి దాడిచేసి వానిని ధ్వంసము చేయువిధముగా పంచకోశములను నశింపజేయు శక్తిగల గురుస్వామీ! చతుర్వేదములయందలి మహావాక్యములు మర్త్యశరీరములలో నున్నవాడు

'సచ్చిదానంద స్వరూపుడు' అని ఘోషించు చున్నవి. గురువులు 'నీవు బ్రహ్మమే' అని చెప్పుచున్నారు. అయినప్పటికి వ్యక్తి 'నేను సచ్చిదానంద స్వరూపుడను' - అని అనుభవగోచరము గావించుకొనుట ఎట్లు?"

113. గురువు: "పునర్జన్మలు పూర్వకర్మల వలన అనివార్యముగా కలుగునని చెప్పినప్పుడు వ్యక్తి పూర్వమున్నాడని అర్థమగుట లేదా? మరియు స్వర్గ-నరకములు ప్రస్తుత కర్మల ఫలితము లయినచో ఆ వ్యక్తి భవిష్యత్తులో గూడ కొనసాగునని తెలియుట లేదా? మాయాజనితములయిన స్వర్గ-నరకములకు అనుకూలమగు సూక్ష్మ శరీరము, దేవతా శరీరము, మానవ శరీరము తఱచుగా మారుచు నశించుచుండును. సర్వదా అసత్య శరీరానంతరము జీవించియుండువాడు సత్ అనిచెప్పుట సముచితము.

114. గాఢ నిద్రను,రాత్రిని ఆవరించు అంధకారములో సూర్యుడు గానీ దీపముగానీ లేనపుడు వ్యక్తికి నిస్సందేహముగా చీకటి యొక్కయు విషయములయొక్కయు ఎఱుక ఉండు, కావున అతడు చిత్.

ప్రీతిపాత్రమయిన విషయము పట్ల మాత్రమే ప్రేమ అభివ్యక్తమగును గనుక నిరుపమానసుఖరూపమయిన ఆత్మపట్ల తన ప్రేమ ఎన్నడును నశించదు గనుక ఆ వ్యక్తి ఆనందము గూడ.

115. ఆహార, పానీయాదులు సుఖకరములుగనుక అవి అందరకు ఒకే విధముగా ప్రియములగును. ఆ విధముగా ఆత్మ సుఖసాధనము కాదు. పయిని వర్ణింపబడిన ఆత్మ అన్యసుఖసాధనములలో ఒకటిగా వర్గీకరింపబడినచో సుఖముగానీ దానిని అనుభవించు వ్యక్తిగానీ వేఱుగా ఎక్కడ ఉన్నాడు? ఆత్మ రెండుగా ఉండగలదా?

116. విషయ సుఖము పట్ల ప్రేమ విశదమే. ఆత్మ పట్ల ప్రేమ అద్వితీయమయినది. విషయసుఖముల పట్ల ప్రేమ మార్పులను పొందును, కానీ ఆత్మపట్ల గలగాఢప్రేమ మారకుండా ఉండును. విషయసుఖములను అనుభవించవచ్చు లేక తిరస్కరింపవచ్చు, కానీ ఆత్మను అంగీకరించుటకు గానీ తిరస్కరించుటకు గానీ ఎవడున్నాడు? ఆత్మ అన్యసుఖముల నన్నిటిని తిరస్కరింపగలదుగానీ తనను తాను తిరస్కరింపజాలదు.

117. తీవ్రమగు కోపముతో ఆత్మహత్య చేసికొనుట ద్వారా ఆత్మ తనను తాను చంపుకొని తనను వదలించుకొనునని ఊహించుట తప్పు. దేహమును చంపు వ్యక్తి తాను త్యజించిన దేహము కాజాలడు. జుగుప్స దేహముపట్ల ఉండునుగాని ఆత్మపట్ల ఎన్నటికి ఉండదు.

118. సంపద అత్యంతము కోరబడునది, కానీ సంపదకంటె కొడుకు ఎక్కువ ప్రియమయినవాడు; తన కొడుకుకంటే తన శరీరము ప్రియతరము; ఇంద్రియములు శరీరముకంటే ప్రియతరములు; ఇంద్రియములకంటే ప్రాణము ప్రియతరము; ఇక ఆత్మ జీవితముకంటెను అత్యంతము ప్రియతరమయినది. ఈ ఆత్మ మూల వస్తువు. అన్యములయిన మూడు ఆత్మలు అనగా, కొడుకు, మిథ్యాత్మ (దేహము), కర్త (అహంకారము) గౌణములు- అప్రధానములు. క్రమముగా వీనిలో ఒక్కొక్కటి ప్రాధాన్యము వహించును.

119. వ్యక్తి మరణ సమయమున గౌణాత్మ, అనగా, తండ్రి ఆస్తికి వారసుడగు కొడుకు ప్రాధాన్యము వహించును. పోషణ సమయమున మిథ్యాత్మ, అనగా, దేహము, ముఖ్యమగును. సుఖమయమయిన భావిజీవితమును గోరినపుడు కర్తయగు ఆత్మ అనగా, అహంకారము ప్రధానమగును. కానీ మోక్షదశయందు ఆత్మ, అనగా, శుద్ధచైతన్యము ప్రధానతమమగును,

120. పెద్దపులి గూడ విధేయముగా నున్నపుడు ఇష్టమగును. కొడుకయినను తనకు ప్రతికూలు డయినచో ద్వేషింపబడును. లోకములో తృణము మొదలగు వస్తువులను ఎవ్వరును ప్రేమించరు, ద్వేషించరు; వాని యెడల ఉపేక్ష వహింతురు. కానీ ఎట్టి పరిస్థితులలోను ఎవ్వరికిని శుద్ధాత్మ యందలి ప్రేమ క్షీణింపదు.

కావున, కుమారా! కేవలము అవిచ్ఛిన్నమయిన ఆనందమగు నీ నిజస్వభావమును గూర్చి విచారణచేయుము; ఆత్మను అనుభవగోచరము గావించుకొనుము!"

121. శిష్యుడు: పూజ్యగురువర్యా! ఎన్ని విధములయిన ఆనందములున్నవి?

గురువు: "ఆనందము మూడు విధములుగా నుండును:-

1. బ్రహ్మానందము (ఇది శుద్ధ చైతన్యముగా ప్రకాశించును. ఉదాహరణకు, అది అట్లు నిద్ర యందుండును)

2. వాసనానందము (ఇది స్మృతియందు ఉండును);

3. విషయానందము (ఇది ఇష్టవిషయప్రాప్తి వలన గలుగు సంతోషము). అయినను ఎనిమిది విధములయిన ఆనందము లున్నవని కొందరు చెప్పుచున్నారు. పయిమూడింటిలో ఇతరములయిన (ఎనిమిదిలోని) అయిదు ఆనందములు ఇమిడియున్నవి. అయినను ఈ ఎనిమిదింటిని నీకు చెప్పెదను వినుము.

122.

1. విషయసుఖము: ఇంద్రియభోగముల వలన గలుగు సుఖము;

2. బ్రహ్మసుఖము: స్వప్నరహిత నిద్రానందము;

3. వాసనాసుఖము: మేల్కొన్న వెంటనే కొన్ని నిమిషముల సేపు పయి నిద్రానందమును స్మరించుట;

4. ఆత్మసుఖము: ప్రియవిషయము లన్నింటిలోను ఆత్మ ప్రియతమము అని నిర్ణయించిన తరువాత కలుగు ఆనందము;

5 ముఖ్యసుఖము అజ్ఞానమను తెర పూర్తిగా తొలగినపుడు సమాధివలన గలుగు ఆనందము;

6. నిజసుఖము: ఉదాసీనత వలన గలుగు తృప్తి;

7. అద్వైత సుఖము: ద్వైతమును వర్జించి ఆత్మను అంటిపెట్టుకొనుట వలన గలుగు ఆనందము;

8. విద్యాసుఖము: శాస్త్రవాక్యములను అనుసరించి ఆత్మవిచారణ వలన గలుగు ఆనందము.

123. వత్సా! వీని విశిష్ట లక్షణములను వర్ణించుచున్నాను, వినుము. జాగ్రదవస్థలో ఎల్లప్పుడు కష్టపడు జనుడు శ్రమవలన తన ప్రక్కమీద విశ్రాంతిని గోరును. అపుడు అతని మనస్సు చక్కగా అంతర్ముఖ మగును. ఇక అట్టి స్థితిలో ఆ మనస్సునందు స్వయంప్రకాశమయిన చైతన్యము యొక్క ఆనందస్వరూపము ప్రతిఫలించును. అపుడు అతడు అనుభవించు సుఖము విషయసుఖమును నిరూపించును.

వివరణము: ఆనందము సత్త్వగుణ లక్షణమని యింతకు ముందే చెప్పబడినది, అది శాంతి స్థితి. అందువలన ఆనందము యొక్క ఎట్టి సూక్ష్మ భేదమున కయినను- ఇంద్రియ సుఖమునకు సైతము -సంక్షోభరహితమయిన మనస్సే మూలము.

124. విషయసుఖములు బాధామయములయిన త్రిపుటులతో (భోక్త-భోగము- భోగ్యవిషయము అను మూడింటితో గూడినవి గనుక తుచ్ఛములని భావించు వ్యక్తి, తన గూటిలో వ్రాలు గ్రద్దవలె, మనస్సును విశ్రాంతిలోనుంచి, నిద్రలోనికి జారుకొని పరిమితిరహితమగు పరబ్రహ్మముతో ఏకమయి ఆనందమయమయిన ఆత్మగా ఉండును. ఈ పరమానందస్థితి అనుపమానమయిన బ్రహ్మానందము. [చూడుడు 122-(2)]

125. గాఢ నిద్రానందము బ్రహ్మానందమని వేదములు చెప్పుచున్నవి.కొందరు వ్యక్తులు నిద్రించుటకు మెత్తని ప్రక్కలను అమర్చుకొనుటకు తీసికొను అధిక శ్రద్ధ సుషుప్తి సుఖమునకు సమర్ధకమగును. ఆ స్థితియందు, ప్రియాలింగన సమయమునందువలె,మంచి-చెడు,స్త్రీ-పురుషుడు, లోపల-వెలుపల అనుభావన అంతయు నశించును. ఆ అనుభవము పయి సుఖమును దృఢపఱచుచున్నది. కావున ఇది నిస్సందేహముగా బ్రహ్మానందము.

126. శిష్యుడు: దేవతలకు సైతము పూజ్యుడ వయిన గురుదేవా! మీరు సర్వజ్ఞులు గనుక దయతో నా యీ సందేహమును తీర్చగలరు. కార్య కారణమయమయిన ఈ ప్రపంచములో ఒకరి అనుభవమును మరియొకడు స్మరింపజాలడు. గాఢ నిద్రలో విజ్ఞానమయకోశము అణగియుండును. ఆనందమయకోశము ఆనందమునననుభవించును. ఈ అనుభవమును విజ్ఞానమయకోశము స్మరించి వర్ణించుననుట సమంజసమా?

127. గురువు: ఈ రెండు కోశములు కరిగిన నేయి, ముద్దగానున్న వెన్న-వంటి వని తెలిసికొనుము. అవి తమ్ము పరిమితము గావించు ఆలోచనలలో భేదించునుగాని తమకు సహజమయిన (అంతర్గతమయిన)జ్ఞానములో భేదింపవు. మనస్సుచే పరిమితము చేయబడి జాగ్రదవస్థలో క్రియా శీలముగా నున్న విజ్ఞానమయ కోశము, బాధాపూరితమయిన మనస్సు గాఢనిద్రలో అణగినపుడు కనిపించు శుద్ధ చిదానందమువలన ఏర్పడిన ఆనందమయకోశము పరస్పరము భిన్నములుగావు. అవి వాననీరు మరియు నిలువచేయబడిన చెరువునీరువంటివి, లేక చక్కెర పానకము వంటివి."

128. శిష్యుడు: “అట్టి సందర్భమున ఎవ్వరయినను ఆ అద్వయబ్రహ్మానందము యొక్క పట్టును గోల్పోయి దానినుండి ఎందుకు వెలుపలకు రావలెను?”

గురువు: "అతడు తన పూర్వకర్మబలము వలన వెలుపలకు లాగబడుచున్నాడు. గాఢనిద్రనుండి అపుడే మేల్కొన్న వ్యక్తికి వెంటనే ఆ ఆనందము నశింపదు. ఏల అనగా, అతడు వెంటనే కదలాడడు, మరియు ఆ ఆనందమును మఱవడు. నిద్రయో మెలకువయో కాని ఈ స్వల్ప శాంతిమయ విరామము స్మరణానందము (చూ. 122-(3).

129. 'శరీరమే నేను' - అను భావన మొదలయిన క్షణమున వ్యక్తి ప్రాపంచిక బాధలలో నిమగ్నుడయి ఆనందమును మఱచును. అతని పూర్వకర్మ సుఖమునుగానీ కష్టమును గానీ కలిగించును. సమత్వస్థితియందే శాంతి కలుగును. ప్రతివ్యక్తి ఆలోచనారహితస్థితిని, తత్ఫలితమయిన సుఖమును అనుభవించి యున్నాడు. ఇది నిజానందము. (చూ. 122-(6).

130. ఇది సమాధి యొక్క ఆనందము కాగలదా? కాదు. వెలుపలనున్న తడి, కుండలోనున్న నీరు కాదు. ఉదాసీనతవలన గలుగు ఈ సుఖము ఆవిర్భవించుచున్న అహంకారము పయివేయబడిన యోగసమాధి సుఖముయొక్క ఛాయ మాత్రమే. అహంకారము అణగి సమాధి సిద్ధించినపుడు 'శాంతి' స్థితి ఉండును. దానిలో మనస్సు పరిసరముల నెఱుగకుండా నిద్రలేకుండా ఉండును. దేహము నిలువుగా పాతిన కొయ్యవలె గట్టిగా నుండును.

131. ప్రపంచముయొక్క ఏకైకసార్వభౌముడు అనుభవించు ఆనందముకంటె మనుష్యగంధర్వుల ఆనందము నూరురెట్లు; వారి ఆనందము కంటె దేవగంధర్వుల ఆనందమునూరురెట్లు; వారి ఆనందముకంటె సృష్ట్యాది నుండి యున్న పితృదేవతల ఆనందము నూరురెట్లు; వారి ఆనందము కంటే తరువాతి దేవతల ఆనందము నూరు రెట్లు; వారి ఆనందముకంటె ఇంద్రుని ఆనందము నూరురెట్లు; ఇంద్రుని ఆనందముకంటే బృహస్పతి ఆనందము నూరు రెట్లు; బృహస్పతి ఆనందము కంటె ప్రజాపతి లేక హిరణ్యగర్భుని ఆనందము నూరురెట్లు; హిరణ్యగర్భుని ఆనందము కంటే

బ్రహ్మానందము నూరురెట్లు. అయినను ఈ ఆనందము లన్నియు అసంపూర్ణములు, బ్రహ్మానంద సాగరములోని బుడగలు, నురుగుల వంటివే.

132. అత్యుత్తమమయిన సప్తమ భూమిక యగు తురీయాతీత స్థితియందు ఏ వ్యక్తి ఉన్నప్పటికీ, ద్వైత-నిద్రారహితమగు ఆయన యొక్క చిదానందానుభవము నారద, శుక, శివ, విష్ణు, బ్రహ్మాదుల చిదానందానుభవము వంటిదే. వాని పావన పాదధూళి నా నమ్ర శిరస్సు మీద నిలుచుగాక!

133. ఇంతవఱకు నేను నీకు అయిదు విధములయిన ఆనందమును గూర్చి చెప్పితిని. తరువాత నేను విద్యానందమును (చూ122-(8)) వర్ణించెదను. మాయా-సచ్చిదానందములను వివరించునపుడు ఇంతకుముందే నేను సర్వప్రియతమమయిన ఆత్మానందమును, అద్వితీయానందమును వర్ణించియున్నాను. ద్వంద్వరహితా! కుమారా! నీకు ఇంకను ఏమయిన సందేహములున్నచో అడుగుము.

134. శిష్యుడు: "సుబ్రహ్మణ్యస్వామిని, నన్ను, సమస్తవిశ్వమును సృజించి రక్షించు స్వామీ! నా మాట వినుడు!

మీరు చెప్పిన సత్, చిత్, ఆనందము అను పదములలో ప్రతిపదమునకు దాని ప్రత్యేక లక్షణము లున్నచో ఇప్పటికే చంచలముగా నున్న మనస్సును ఏకత్వము మీద నిలుప గలుగు టెట్లు? అవి ఒకే అర్థముగల విభిన్న పదము లని నాకు అనిపించుట లేదు. తేనెటీగలు వేర్వేరు పుష్పములనుండి సేకరించినను ఒకే రూపమున ఉన్న తేనెవలె, అవి అన్నియు అవిభాజ్యమయిన సజాతీయమగు ఏకవస్తు వెట్లగునో దయతో నాకు తెలుపుడని వేడుచున్నాను.

135. గురువు: "నీరు తన చల్లన, తడి, స్వచ్ఛత- అనెడి కారణములవలన మూడు భాగములుగా ఉండునా? అగ్ని తన కాంతి, ఉష్ణ, అరుణ వర్ణములను కారణములవలన మూడు భాగములుగా ఉండునా?

వేదములు ఆకాశాది సమస్తవిశ్వమును వివరించి అది అసత్యమనియు, జడమనియు, దుఃఖభరితమనియు నిరసించినవి. దీనికి విరుద్ధముగాను, సులభముగా అర్థము జేసికొనుటకును వేదములు బ్రహ్మమును సత్, చిత్, ఆనందముగా అభివర్ణించినవి; అది ఒక్కటే.

136. వేదములు బ్రహ్మమును, 'శాశ్వతము, పూర్ణము, విలక్షణము, అత్యుత్తమ సత్యము, పరబ్రహ్మము, ఆధారము లేక మూలము, శాంతి, నిత్యసత్యము, అఖండము, తురీయము, నిరంతరము లేక సర్వసమము, దృక్, సర్వసాక్షి, జ్ఞానము, (వేదములచే) పరోక్షముగా తెలుపబడినది, చిరస్థాయి, అంతర్యామి, సత్త, ఆకాశము, జ్యోతి, ఆత్మ, మోక్షము, ఈశ్వరుడు, సూక్ష్మము'- మొదలగు విధముగా నిశ్చయపదములలో వర్ణించినవి.

137. ఆ వేదమే-'అచలము, అమలము,, అమరము, అమేయము, అకళంకము, వాగతీతము, అజడము, అనామయము, అకలుషము, అసదృశము, అప్రతిబంధము, (మనస్సుతోగానీ ఇంద్రియములతోగానీ) అప్రాప్యము, అవిభక్తము, అజము, అనంతము, అనశ్వరము, నిర్గుణము, నిరవయవము, అనాది, దేహరహితము, అవికార్యము, అద్వితీయము మొదలగు నిషేధవచనములలో బ్రహ్మమును వర్ణించినది. 138. నిశ్చయార్థకము లయినను, నిషేధార్థకము లయినను ఈ గుణములనన్నిటిని కలిపి చక్కగా పరిశీలించినచో ఇవి ఒకే వస్తువును సూచించుచున్నవి. అన్యము ఉండజాలదు. ఒకే వస్తువును తెలుపుటకు అనేక పదము లుండవచ్చును. ఆవిధముగా సత్-చిత్-ఆనందములతో తెలుపబడిన బ్రహ్మము ఏకము మాత్రమే. ఈ ఏకత్వమును అనుభవగోచరము గావించుకొని అఖండ పూర్ణ బ్రహ్మముగా ఉండుము.

139. "గుణములతో బ్రహ్మమును వర్ణించుట గొడ్రాలి కొడుకును గూర్చి మాట్లాడుటవంటిదని అనకుము. మాటలతో చెప్పకుండా బ్రహ్మస్వరూపమును అవగతము జేసికొను మేధావి ఎవ్వడయినను ఉండగలడా? బ్రహ్మజ్ఞాన ప్రాప్తి కొఱకు జీవన్ముక్తి కొఱకు వేదములు అనుగ్రహముతో వ్యక్తము జేసినవి బ్రహ్మగుణములు కావు, అవి సాక్షాత్తుగా బ్రహ్మమే."

వివరణము: వేదము, యుక్తి, అనుభవము- అను మూడుప్రమాణములు తత్త్వమును నిరూపించును. వీనిలో వేదము 130-139 పద్యములలో పేర్కొన బడినది, యుక్తి 140-143 పద్యములలోను, అనుభవము 144వ పద్యములోను పేర్కొనబడును.

140. శిష్యుడు: "ప్రభూ! ఒకేసారి ఉదయించిన కోటి సూర్యులవలె, నా అజ్ఞానాంధకారమును తొలగించుటకై, తాము అవతరించితిరి! మరల నా
మాటను ఆలకింపుడు:-

వేదవచనముల ననుసరించి నా 'ఆత్మ' అవిభాజ్యమగు 'తత్త్వము' అని యిపుడు నేను నిస్సందేహముగా అర్థము చేసికొంటిని. ఇంకను మీరు యుక్తులతో దానిని నిరూపించినచో ఆ సత్యము, సజీవ వృక్షములో నాటిన ఇనుపశూలమువలె నా మనస్సులో దృఢముగానుండును."

141. గురువు: సత్తయే చిత్గా ఉండి తీరవలెను. చిత్ సత్తకంటే విభిన్నమయినచో, దిరు కావలయును. అపుడు సత్త ఎట్లు వ్యక్తము కాగలదు?

మరియు, చిత్ స్వయముగా సత్తగా ఉండి తీరవలెను. చిత్ కంటె భిన్నమయినచో సత్త జడమయి తీరవలయును. జడము స్వయముగా ఉండజాలదు. ఆ విధముగా 'సత్' 'చిత్'లు అభిన్నములు గనుక అది ఆనందము గూడ. ఇది అత్యంత యోగ్యమయిన యుక్తి అట్లు కానిచో ఆనందము అస్తిత్వరహితమయి జడముగా నుండును. ఇక ఆనందము యొక్క అనుభవము ఉండదు, అది అసంగతము. ఇక్కడ గురువు స్వయముగా ప్రశ్నలు వేసి సమాధానము చెప్పుచున్నాడు.

142. ప్ర సర్వకాలములయందుండు సత్ స్వయముగా వ్యక్తమగునా? లేక ఇతరముతో వ్యక్తమగునా?

స: ఇతరముతో.

ప్ర: ఆ ఇతరము అస్తిత్వరహితమా లేక అస్తిత్వసహితమా?

స: అస్తిత్వరహితము.

ప్ర: మందమతీ! గొడ్రాలి కొడుకు ఏమయినను చేయగలడా? లేనిది ఏమియు చేయలేదు.

స: అట్లయినచో అది మూలమయిన సత్ కంటే విభిన్నమయి అస్తిత్వసహితమగు ఒకానొకవస్తువు అగుగాక.

ప్ర: దాని అస్తిత్వము ఎట్లు వ్యక్తమగును? నీ పూర్వ సమాధానము ననుసరించి 'మరియొక ఇతరముతో' - అని నీవు చెప్పవలెను.

ఈ విధముగా మొదటి 'సత్'ను తెలిసికొనుటకు వేరొక 'సత్', ఆ 'సత్'ను తెలిసికొనుటకు వేరొక 'సత్' - ఇట్లు 'సత్', దానిని తెలిసికొనునది'-అను ఈ పరంపరకు అంతము ఉండదు. దీనిని అనవస్థాదోష మందురు. కావున నీ సమాధానము నిలుచునదికాదు, అందువలన ఈ మిథ్యాతర్కమును వదలిపేయుము.

143. వేదమునకు, యుక్తికి అనుకూలమయిన అనుభవమును ఆలకింపుము. గాఢనిద్రవలన గలుగు ఆనందము జ్ఞప్తిగా నిలిచియుండును గనుక ఈ ఆనందమే జ్ఞానము కావలయును. దానికంటె వేఱుగా ఏదియులేదు. లయములోను, గాఢ నిద్రలోను వర్తించుచు నీవు అజ్ఞానాంధకారమునకు సాక్షిగా నున్నావు. ఇపుడు హృదయమున ప్రవేశించి సర్వోత్తమమయిన ఆత్మగా ఉండుము."

144. స్వయముగా బహుశాస్త్రములు సత్యసారము ననుభవగోచరము గావించుకొన్న సద్గురుని ఉపదేశములననుసరించి ఈ శిష్యుడు గూడ పలుచోటులనుండి (పుష్పములనుండి) సేకరించిన తేనెవలె, సత్,చిత్, ఆనందములు - సజాతీయమయిన ఏకైక తత్త్వము (బ్రహ్మము) అని అనుభవగోచరము జేసికొని చాలకాలము సమాధి నిష్ఠుడయినాడు. అతడు తన కనులను తెరచిన తరువాత తాను తెర అనియు, దాని మీద విశ్వములోని చరాచర వస్తువులతో గూడిన నానావిధ చిత్రములు కదలుచున్నవనియు తెలిసికొన్నాడు.

145. శిష్యుడు: “మదీయహృదయవాసా! గురుదేవా! విశిష్టమయిన ఈ అనుభవమును పొందుటకంటె అధికముగా చేయవలసినది మాకు ఏమయినను ఉన్నదా? దీనిని గూర్చి ఆలోచించుట, మాట్లాడుట, ఈ అనుభవమునందు నిమగ్నుడయి ఉండుటయే జ్ఞానులకు ఏకైక కర్తవ్య మనిపించుచున్నది. పూర్వము పేర్కొన బడిన తురీయాతీతము (చూ. 132) లేక సప్తమ జ్ఞానభూమిక ఎట్లు అత్యుత్తమమో నాకు దయతో స్పష్టముగావింపుడు.”

146. గురువు: “పరిశీలనానంతరము ఏడు అజ్ఞానభూమికలు, ఏడు జ్ఞానభూమికలు ఉన్నవని పెద్దలు చెప్పుచున్నారు. మొదట ఏడు అజ్ఞానభూమికలను చెప్పుచున్నాను, వినుము. వానికి పెద్దలు ఈ విధముగా నామకరణము గావించినారు:-

1. బీజజాగ్రత్: మెలకువయొక్క ఆవిర్భావ దశ.

2. జాగ్రత్ : జాగ్రదావస్థ.

3. మహాజాగ్రత్: దృఢముగా నెలకొన్న జాగ్రదవస్థ.

4. జాగ్రత్ స్వప్నము: మేల్కొని కల గనుట (గాలిమేడలు).

5. స్వప్నము: స్వప్నావస్థ.

6. స్వప్న జాగ్రత్: స్వప్నమునుండి మేల్కొన్న పిదప స్వప్నమును గూర్చి ఆలోచించుట.

7. సుషుప్తి: స్వప్నరహిత నిద్ర.

ఇక వీని వివరణము:

147,148. 1. బీజ జాగ్రద్దశ యనగా ఏకరూపమగు సత్తా దశనుండి అప్పుడే ఆవిర్భవించు అసంకీర్ణము (అన్యసంపర్కము లేనిది) అగు చైతన్యము.

2. పూర్వము ఆవిర్భావ దశనుండి లేని అహంకారాంకురముతో గూడినది జాగ్రదావస్థ.

3. ప్రతిజన్మతో ఉదయించు 'అహంకార', 'మమకారముల' దృఢమయిన ఆవిర్భావము మహాజాగ్రత్.

4. దృశ్యముల గారడిజేయుచు గడబిడ గావించు అహంకారము పగటి కలలు గను జాగ్రత్ స్వప్నము.

5. కడుపునిండ భుజించినపిదప నిద్రించునప్పుడు అవశముగా దృశ్యములను జూచుట స్వప్నావస్థ.

6. స్వప్నములనుండి మేల్కొన్న పిదప ఆ స్వప్నములను గూర్చి ఆలోచించుట స్వప్నజాగ్రత్.

7. దట్టమయిన అజ్ఞానాంధకారము సుషుప్తి (గాఢనిద్ర) స్థితి. ఇవి ఏడు అజ్ఞాన భూమికలు. మోక్షదాయకములయిన సప్తజ్ఞానభూమికలను ఇపుడు నీకు చెప్పెదను.

149. పెద్దలు వీనిని ఈ విధముగా విభజించిరి:

1. శుభేచ్ఛ: తత్త్వాభిలాష,

2. విచారణ: తత్త్వాన్వేషణ.

3. తనుమానసి: స్వచ్ఛము, క్షీణము నయిన మనస్సు.

4. సత్త్వాపత్తి : తత్త్వసాక్షాత్కారము.

5. అసంసక్తి: ప్రపంచమును దాని విషయములను ఉదాసీనముగా జూచుట.

6. పదార్థాభావని: అకళంకమయిన ఆత్మజ్ఞానము.

7. తురీయము: అత్యుత్తమయిన, అనిర్వచనీయమయిన స్థితి.

150,151.

1. నికృష్టమయిన సాహచర్యములనుండి తప్పించి బ్రహ్మజ్ఞానమును గోరుట ప్రథమ భూమికయగు శుభేచ్ఛ.

2. జ్ఞానుల సాంగత్యమును పొంది వారినుండి తత్త్వమును తెలిసికొని దానిని గూర్చి ఆలోచించుట విచారణ.

3. శ్రద్ధతో తత్త్వమును ధ్యానించుట ద్వారా కోరికలను విసర్జించుట తనుమానసి.

4. పైని చెప్పిన నియమములను పెంచుకొనుటవలన అత్యుత్తమమయిన జ్ఞానము ప్రకాశించుట సత్త్వాపత్తి (సాక్షాత్కారము).

5. స్థిరమగు తత్త్వసాక్షాత్కారము వలన భ్రాంతిని త్యజించుట అసంసక్తి (విశ్వమును ఆసక్తి లేకుండ జూచుట).

6. త్రిపుటీ రహితమయిన అద్వయాత్మానందము, అకళంకమయిన ఆత్మజ్ఞానము పదార్థాభావని.

7. సత్యమయిన ఆత్మ స్వరూపము యొక్క ఉత్కృష్టమయిన మౌనము తురీయము.

ఈ సప్తమ జ్ఞానభూమిక (చూ.149) ఎందుకు తురీయాతీతము అని చెప్పబడినదో వినుము.

152. మొదటి మూడు జ్ఞానభూమికలు 'జాగ్రత్' అని చెప్పబడినవి. ఏల అనగా, వానిలో పూర్వము వలె ప్రపంచము కనిపించును.

నాలుగవ భూమిక 'స్వప్న'మునకు అనుగుణముగా నుండును (ఏల అనగా ప్రపంచము స్వప్నతుల్యముగా గుర్తింపబడును).

పంచమ భూమికయందు అస్పష్టమయిన ప్రపంచదర్శనము గూడ క్రమముగా అదృశ్యమగును. అందువలన అది నిద్రాస్థితి అనబడుచున్నది.

సర్వోత్తమయిన ఆనందము ఆరవభూమికలో ప్రబలముగానుండును. అందువలన, అది తురీయము అనబడును (అనగా, ఇది, పైని చెప్పిన జాగ్రత్ స్వప్న సుషుప్తి దశలదృష్ట్యా నాలుగవదశ).

అన్ని ఊహలకు అతీతమయిన భూమిక ఏడవది. దీనిని వేదములు అతిశయమయిన మౌనముగా (అనగా తురీయాతీతముగా) సూచించుచున్నవి.

153. తురీయము అనుపేరు పయిని చెప్పిన తురీయాతీతము యొక్క వివరణమునకు విరుద్ధముగా నున్నదని కొందరు జ్ఞానులు భావించుచున్నారు. వారి అభిప్రాయము ననుసరించి అది ప్రసిద్ధమయిన 'విదేహముక్తియే'. అట్టి పద్ధతిలో, పంచమ భూమికకు సంబంధించిన స్వప్నరహిత నిద్రతో పోల్చినపుడు ఆరవ భూమిక అత్యంత గాఢమయిన నిద్ర అగును. ఇంకను ఈ ఉజ్జ్వల భూమికల యొక్క విశిష్టలక్షణములను నీకు చెప్పెదను.

154. ఇప్పటికిని మొదటిభూమికలలో ఉన్నవారు సాధకులేగాని ముక్తులు గారు. చతుర్థభూమికలోనికి ప్రవేశించినవారు బ్రహ్మవిదులు; వారు శుద్ధులు, ముక్తులు. తరువాతి మూడు భూమికలలో ఉన్నవారు క్రమముగా బ్రహ్మవిద్వరులు, బ్రహ్మవిద్వరీయులు, బ్రహ్మవిద్వరిష్ఠులు. అనగా, బ్రహ్మవేత్తలలో విశిష్టులు, విశిష్టతరులు, విశిష్టతములు, జ్ఞానుల భూమికల యొక్క శ్రేష్ఠత్వమును ఇంకను అధికముగా నీకు నేను చెప్పెదను.

155. మొదటి మూడు భూమికల యందుండి నాలుగవ భూమికకు చేరుటకు ముందు మరణించినవారు పుణ్యలోకములకు పోవుదురు; పిదప వారు మరల జన్మించి క్రమముగా ముక్తిని పొందుదురు. వారు నిశ్చితముగా నికృష్టమయిన అధోభూమికలకు పోరు.

వత్సా! మొదటి భూమికయే పొందుటకు కష్టమయినది. దీనిని పొందినచో ముక్తి లభించినట్లే.

156. ఈ ప్రపంచమున ప్రథమ భూమికనుగానీ, ద్వితీయ భూమికను గానీ పొందినవారు మ్లేచ్ఛులు (వేదబాహ్యులు) అయినను ముక్తులతో సమానులే. నా గురుని పావనపాదముల సాక్షిగా ఇది సత్యము! దీనిని నిరాకరించువారు. భ్రష్టులు. అందరకు సమానమయిన వేదములను సందేహింపకుము. సూచించిన మార్గమును కచ్చితముగా అనుసరించుచు, 'అహం బ్రహ్మాస్మి' – అను వాము స్పష్టముగా అనుభవగోచరము గావించుకొనుము!"

157. శిష్యుడు: "ప్రభూ! మరల మొలకెత్తు ధాన్యము నుండి బియ్యము వలె మీరు నన్ను (ఆత్మను) వేరు జేసి చూపితిరి. జ్ఞానభూమికలు హేయమయిన మ్లేచ్ఛునికి సైతము అంతిమ మయిన మోక్షమును గలిగించునని మీరిప్పుడే Aచెప్పితిరి వ్యక్తి కుటుంబ బంధములనన్నిటిని పరిత్యజించి సన్న్యాసిగా ఏకాంతమునకు పోనియెడల-మోక్షము లభింపజాలదని కొందరు చెప్పుచున్నారు. దయతో ఈ విషయమున నా కలవరమును తొలగింపుడు"

వివరణము:సన్న్యాసములో క్రింది అర్థములు ధ్వనించును. బ్రాహ్మణుని చతుర్థాశ్రమము సన్న్యాసము. ఆయన ప్రారంభమున బ్రహ్మచారిగా శ్రీ వేదాధ్యయనము జేసి, పిదప వివాహమాడి గృహస్థుడయి, తరువాత వానప్రస్థగా ఏకాంతవాసి అయి చివరకు సర్వము త్యజించి సన్న్యాసి అగును. క్షత్రియులు గూడ సన్న్యాసమునకు అర్హులని కొందరు, వైశ్యులు గూడ అర్హులనియు, శూద్రాదులు అర్హులుకారనియు మరికొంద రందురు.

158. గురువు: "సాధుశీలా! వత్సా! నీ సందేహము సరి అయినదే; దానిని నేను తొలగింతును, వినుము. కుటుంబసంబంధములను విచ్ఛిన్నముజేయు ఇం సన్న్యాసములు నాలుగు విధములుగా నుండును: 1. కుటీచకము

2. బహూదకము 3. హంస, 4. పరమహంస. ఇవి అన్నియు ప్రాపంచిక దుఃఖములను నివారించు మంచి ఔషధములు. కాని అట్టి సన్న్యాసమునకు ఆవశ్యకమయిన ఏకైక విషయము వైరాగ్యము గాని కాషాయవస్త్రములు గావు.

159. మరల వైరాగ్యము మూడు విధములుగా నుండును. 1. మందము 2. తీవ్రము 3. అతితీవ్రము. సంక్షోభమువలన గలుగు వైరాగ్యము ఆవేశపూరితము, మందము. గృహమును, సంపదను శాశ్వతముగా త్యజించుట తీవ్రవైరాగ్యము. బ్రహ్మలోకముగూడ మాయామయమను నిర్వేదము అతి తీవ్రవైరాగ్యము.

160,161. మందవైరాగ్యముగలవారు సన్న్యాసమునకు అర్హులు గారు. తీవ్రవైరాగ్యముగలవారు మొదటి రెండు విధములయిన సన్యాసములకు అర్హులు. వీరు బలిష్ఠులు, యోగ్యులు నయినచో బహూదకులుగా అంతట పర్యటింపవలయును, అట్లు కానిచో కుటీచకులుగా ఒక చోట ఉండవలయును. వైరాగ్యము అతి తీవ్రముగా నున్నపుడు వ్యక్తి హంస సన్న్యాసమును గాని పరమహంస సన్న్యాసమును గాని స్వీకరింపవచ్చును. హంస సన్న్యాసి సత్యలోకము ద్వారా మాత్రమే అంతిమ మోక్షమును పొందగలడనియు, కానీ పరమహంస సన్న్యాసి ఇక్కడ ఇప్పుడే మోక్షమును పొందగలడనియు కొందరు చెప్పుచున్నారు.

వివరణము: సంక్షోభము పూర్వపాపఫలముగావున దానివలన గలుగు వైరాగ్యము మందమయి అస్థిరముగానుండును, కానీ వైరాగ్యము పుణ్యఫలము.

ఎంతో సమర్ధమయిన పరమహంస సన్యాసము మరల రెండు విధములుగా నుండును.

162. పరమహంస తత్త్వజిజ్ఞాసువుగా ఉండవచ్చును, లేక ఆత్మజ్ఞానిగా ఉండవచ్చును. వీరిలో మొదటి వ్యక్తి మూడు ప్రథమ జ్ఞాన భూమికలలో ప్రజ్ఞావంతుడయిన " సాధకుడుగా నుండును; రెండవవ్యక్తి ప్రసిద్ధుడు, నిర్మలుడు నయిన జ్ఞాని, ఆయన ఈ లోకమున ఇపుడే ముక్తుడుగా నుండును.

ఈ మొదటి పరమహంస మరల రెండు విధములుగా ఉండును. వారిని గూర్చి కూడ నేను చెప్పుచున్నాను, వినుము.

163. వీరిలో మొదటి వ్యక్తి యథావిధిగా గృహ బంధములను పరిత్యజించి సాంప్రదాయికముగా సన్న్యాసాశ్రమమును స్వీకరించి పరమ జ్ఞానమును పొందును. ఇక రెండవ తెగకు జెందినవారు బ్రాహ్మణులుగా, క్షత్రియులుగా, వైశ్యులుగా, శూద్రులుగానే ఉండి పరమజ్ఞానమును పొందుదురు.

ఈ విషయమును శాస్త్రములనుండియు, యథార్థమయిన అనుభవమునుండియు తెలిసికొని కూడ నీవు ఇంకను ఎందుకు కలవరపడుచున్నావు? వేదప్రామాణ్యముతోను, నీ స్వీయయుక్తితోను, నిరంతరానుభవముతోను సర్వసందేహవిముక్తుడ వగుము.

164. జన్మ నిశ్చయమయినచో మరణముగూడ అనివార్యమగును. కానీ జన్మరహితమయిన బ్రహ్మమును నేను. నేను పుట్టినవాడ నయినచో ఈ నేను నిశ్చితముగా బ్రహ్మము కాజాలదు. అందువలన నేను, జనన- మరణరహితబ్రహ్మమగు ఆ 'నేను'గా ఉన్నాను."

165,166 ప్రశ్న: నేను బ్రహ్మమయినచో, నేను ఈ 'నేను' ను ఎందుకు తెలిసికొనుటలేదు?"

సమాధానము: "ఇపుడు 'నేను' అనుచున్నవారెవరు?
ప్ర: బుద్ధి

స: "బుద్ధి మూర్ఛలో నశించును. పరిపూర్ణమయిన చైతన్యముగానుండి ఎన్నడును నశింపనిది 'నేను',"

ప్ర: "ఈ పరిపూర్ణ స్థితినాకు స్పష్టమగుటలేదు. నేను దానిని ఎట్లు అనుభవింపగలను?"

స: "గాఢ నిద్రలో ఆనందానుభవమున్నది. అదే ఆ పరిపూర్ణ స్థితి. కోరిక ఉన్నపుడు ఎక్కడగూడ ఆనందము అనుభవగోచరము కాజాలదు. కావున ఆత్మ ఈ సంపూర్ణత్వము కావలయును. ఇది అన్నిటికి మూలము.

167. మనస్సు యొక్క కల్పనలో విశ్వము పుట్టినది. ఈ లోకములు ఆ చైతన్యములో పుట్టుచున్నవని యుక్తి తెలుపుచున్నది. ఈ దృశ్యప్రపంచమునకు అతీతమయినదిగాను, అపరిమితముగా విస్తరించునదిగాను ఆత్మవిచారణను కొనసాగించినచో 'నేను' ఏకమయిన పూర్ణ సత్తగా మిగులును."

168. శిష్యుడు: "మీరు ఆనందముగా వర్ణించిన దానిని అనుభవగోచరము కావించుకొనుటకై నేను ఎట్లు ఉండవలెను?

గురువు: "జాగ్రత్-స్వప్న-సుషుప్తి దశలను కలిగించు మనోవృత్తిని నీవు వదలించుకొన్నచో నీ వాస్తవరూపముగానుండి ఆనందమును గూడ అనుభవింపగలవు.

169. తన వాసనలనుండి ఆవిర్భవించు మనస్సు యొక్క వ్యాపారములను నిగ్రహించుటెట్లు- అని నీవు అడిగినచో దానికి సమాధానము ఇది:- బుద్ధిని, ఇంద్రియములను నీ బానిసలుగా శాసింపుము. అవి నష్టములగును.

170, మరియు కొలిమితిత్తులవలె చలించు శ్వాసను మెల్లగా నియమించుటవలన గూడ మనోవ్యాపారులు ఆగిపోవును. ఈ యోగమును అభ్యసించుట నీకు ఇష్టము కారణశరీరమను గొప్ప అజ్ఞానమును నీవు నిర్మూలించినచో అవి ఆగిపోవును. అపుడు గూడ మనస్సు తన వ్యాపారములను ఆపివేయును."

171. శిష్యుడు: "కారణశరీర మను అజ్ఞానమును ఏ ఉపాయముతో నేను నిర్మూలింపగలను?"

గురువు: "వేదములు వ్యక్తిని ఎన్నడును మోసగింపవు. "నేను పరిపూర్ణ మయిన సత్తగా ఉన్నాను, నాలో ప్రపంచములు భాసించుచున్నవి"- అను వేదముల ఉపదేశమును నీవు నీ మనస్సులో స్థిరముగా నిలుపుకొన్నచో అజ్ఞానము ఎట్లుండగలదు?"

172. శిష్యుడు: "పరిభ్రమించు మనస్సుతో నేను ప్రాపంచిక వ్యవహారములలో

3. నిమగ్నమయినపుడు ఆ విధముగా ఎట్లుండగలను?"

గురువు: "నా" కంటె వేఱుగా ఏదియులేదు. కనిపించున దంతయు నాకు సంబంధించినదే. నేను ఈ సమస్తమును నా స్వప్నమువలె కల్పితమయిన దానినిగా జూచు చైతన్యస్వరూపమగు నేనుగా ఉన్నాను.

173. 'నేను పరిపూర్ణ చిత్ స్వరూపుడను'- అను ఎఱుక గలిగి నీవు ఎల్లప్పు డున్నచో, నీవు ఎంత ఆలోచించినను లేక నీవు ఏమి చేసినను దానివలన కల్గునది ఏమి? మేల్కొన్న తరువాత స్వప్న దృశ్యముల వలె ఈ సర్వము అసత్యమే. నేను పూర్ణానందస్వరూపుడను.

174-177. శిష్యుడు: "అసంఖ్యాకములయిన నా పూర్వ జన్మలలో దేహము ఆత్మ అని నేను భ్రమించి యుంటిని, ఉత్తమము లయినను, అధమము లయినను ఆ జన్మలన్నింటిని ఎండమావులుగా జూచుచు, నా సద్గురుని అనుగ్రహమువలన, ఆత్మను 'నేను' (అహం)గా అనుభవము గావించుకొని ముక్తుడ నయితిని.

ఎట్టి పుణ్యకార్యమును నేను చేసి యుంటినోగదా! నేను నా గొప్ప అదృష్టమును వర్ణింపజాలను. నా గురువగు "నన్నిలం"లోని నారాయణుని అనుగ్రహముచే నేను ధన్యుడ నయితిని! నేను పారవశ్యముతో నా వస్త్రమును గాలిలోనికి " విసరివేసి సంతోషముతో నృత్యము గావింతును!

నేను ఆత్మను అనుభవగోచరము గావించుకొన్న ఆనందములో మునిగి, పరవశించి నృత్యము చేయుదునని తాము ముందే తెలిసికొన్నట్లు నాకు 'తాండవ' నామకరణము గావించిన నా తల్లిదండ్రులు ఎంత ఉదాత్తబుద్ధులో గదా!

నా యీ ఆనందపారవశ్యమును ఎవరిముందు ప్రకటింతును! ఇది నా లోపలనుండి ఆవిర్భవించి, ఉప్పొంగి విశ్వమంతటను నిండి అపారమయిన వఱదయై పారి ముంచివేయుచున్నది.

శాస్త్ర వాక్యముల ననుసరించి నాకు తత్త్వము నుపదేశించిన సద్గురుని సాంగత్యమును ఎంతో అనుగ్రహముతో నాకు కలిగించిన సర్వేశ్వరుని చరణ కమలములకు నేను నమస్కరించుచున్నాను."

178,179. విద్యానందము ఇట్టిది. భక్తితో ఈ గ్రంథమును అధ్యయనము చేయువారు ఉత్తమమయిన ప్రశాంతిని అనుభవగోచరము గావించుకొని ఇక్కడే ఇప్పుడే ముక్తు లగుదురు. శాస్త్రగ్రంథముల సత్యసారమయిన ఈ విద్యానందమును అందరు స్పష్టముగా అవగతము కావించుకొనవలెనను ఉద్దేశముతో 'నన్నిలం' లోని నా గురువగు నారాయణుడు నా సమాధిలో సాక్షాత్కరించి అన్ని వివరములతో గూడి నిర్దోషమయిన ఈ కైవల్య నవనీతం ను రచింపుమని ఆదేశించినాడు.

180. తాండవేశుడు తన ప్రభుని అనుగ్రహమువలన, వ్యక్తి అంతరములు " బాహ్యములు నగు సమస్త విషయములనుండి తనను విముక్తుని గావించుకొని ఎట్లు ఏకైక బ్రహ్మముగా పరిణతి పొందవచ్చునో తెలిపినాడు; మరియు, భావనాతీతములయిన వేదము లుద్దేశించిన అర్థము 'నేను' (అహం) అనియు, దేహాదులు కేవలము నాదవృత్తులనియు విశ్వసించిన వ్యక్తి 'సర్వదృక్' అయి సర్వమును తననుగా దర్శించును.

181. దేదీప్యమానముగా ప్రకాశించు ఏకైక సాక్షిని- 'తత్త్వమసి' అనువాక్యములోని అత్యుత్తమమయిన ఆ మూడుపదముల అర్థములో సిద్ధమయిన తురీయాతీతమును- నిస్సందేహముగా గుర్తించినవారు 'భేద' గ్రంథిని విడదీసి అన్ని అవరోధములను అతిక్రమించి స్వయముగా లోపలి ఆత్మగా పరిణమింతురు.

182. ఇది వేదములుచెప్పిన "కైవల్యానందము". దీనిని వర్ణించిన నారాయణుని చరణములను అర్చించువారు దోషరహితులు; ఈ శిష్యుని గురువుద్వారా సందేహరహితమయి స్థిరముగా సిద్ధివైపు పురోగమించు దశను జేరువారు నిష్కలంకమయిన మోక్షమును పొందుదురు.

183. అనాది అయిన మాయాంధకారము నశింపవలెనను ఉద్దేశముతో రచయిత ఈ గ్రంథము యొక్క రెండు భాగముల ద్వారా ఉదాత్తమయిన ఆత్మజ్యోతిని వెలిగించి భేదములవలన గలిగిన మానసిక జ్ఞానము నుండి ఆవిర్భవించు సందేహములనన్నింటిని తొలగించుచు శిష్యుని తన వశము గావించుకొన్నాడు.

184. నా ముక్తిదాతకు కృతజ్ఞుడను, కృతజ్ఞుడను! అమేయప్రభువగు నారాయణుని చరణమును అతడు తన తలపయి నిలుపుకొన్నాడు. ఆ ప్రభువు అతనిని తన బానిస గావించుకొని యున్నాడు, మరియు ఆయన నిషేధవిధానమను సాధనముతో ఆరోపము ద్వారా కేవలకల్పితమయిన దృశ్యముగా ఆవిర్భవించిన దానిని నశింపజేసి, అనుగ్రహవీక్షణములతో, నిరంతరము సాక్షి మాత్రుడనై ఉండగల్గునట్టి స్థితిలో నన్నుంచినాడు.

185. మానవుడు తన సద్గురుని శీతల, సుఖకర, పావన పాదతీర్థమును తన తలపయి చల్లుకొన్నచో అది సమస్త పవిత్ర క్షేత్రముల వలన గలుగు పుణ్యములను ప్రసాదించును. అదే విధముగా, ఈ విశిష్టగ్రంథమును అధ్యయనము చేయువారు గూడ సకలశాస్త్రముల వలన గల్గు పుణ్యములను పొంది, జ్ఞానులుగా ప్రపంచమునందు జీవింతురు.

సర్వమ్ శ్రీరమణార్పణమస్తు

## 1. అనుబంధము

| సంఖ్య | జ్ఞానభూమికలు | 1. విభాగము | వివరణములు | 2-విభాగము వివరణములు |
|---|---|---|---|---|
| 1.<br>2.<br>3. | శుభేచ్ఛ<br>విచారణ<br>తనుమానసి | జ్ఞానభూమికలలో జాగ్రత్ (జాగ్రద్దశ) | వీనిలో పూర్వమువలె ప్రపంచము కనిపించును. | |
| 4. | సత్త్వాపత్తి | స్వప్నము | ప్రపంచమునకు ఆధారమయిన తత్త్వము అనుభవగోచరమయి నది గనుక ప్రపంచమే కల్పనవలె కనిపించును. | |
| 5. | అసంసక్తి | సుషుప్తి | అజ్ఞానాంధకారము పూర్తిగా నశించి నందువలన ఇది జ్ఞానభూమికలలో నిద్రకు అనురూపముగా ఉండును. | |
| 6. | పదార్థాభావని | గాఢ సుషుప్తి | ఇందు జ్ఞాతృ, జ్ఞేయ, జ్ఞానములకు అవకాశములేదు. బాహ్యప్రభావ ములు బలవంతముగా తనను వెలికి లాగనిచో వ్యక్తి యీ స్థితినుండి స్వయముగా మేల్కొనజాలడు. | మూడు పూర్వావస్థల దృష్ట్యా ఇది నాల్గవది గనుక **తురీయము.** |
| 7. | తురీయము | పరమమౌనము | వ్యక్తమయినను లేక అవ్యక్తమయినను ఆత్మగా మాత్రమే ఉనికి. | **తురీయాతీతము. తురీయము** నకు అతీతమయినది. |
| 8. | తురీయాతీతము | విదేహముక్తి | దేహపాతము తరువాతి ముక్తిస్థితి. | ఇక్కడ చెప్పవలసినది ఏదియు లేదు గనుక ఇది పరిగణలోనికి తీసికొనబడలేదు. |

## 2. అనుబంధము

**బ్రహ్మచారి**
బ్రహ్మచారిగానుండి వేదాధ్యయనము చేయు వ్యక్తి

**గృహస్థుడు**
వివాహమాడి కుటుంబి అయిన వ్యక్తి. ఇతడు యజ్ఞ యాగాది శాస్త్రోక్త కర్మలను ఆచరించును.

**వానప్రస్థుడు**
ధ్యాన, తపస్సుల కొఱకు ఏకాంతవాసిగా విశ్రాంతి పొందినవ్యక్తి

**సన్న్యాసి**
ప్రపంచమును పరిత్యజించి ఆధ్యాత్మికాన్వేషణకు, ఆత్మసాక్షాత్కారమునకు తనను అర్పించుకొన్నవ్యక్తి

(1) **కుటీచక**
ఇతడు శారీరకముగా బలహీనుడు గనుక ఒక మంచి ప్రదేశమున నివసించును. అయినను ఇతడు తత్త్వాన్వేషణ నిమగ్నుడుగా నుండును.
1,2 ఈ రెండు ఆశ్రమములు గృహబంధములనుండి వేరయిన వారికి ఉద్దేశింపబడినవి. వారి విరక్తి మధ్యమ మయినది.

(2) **బహూదక**
ఇతడు పుణ్యక్షేత్రములను దర్శించుటకు సమర్థుడు, యోగ్యుడు.

(3) **హంస**
ఇతడు దేహపాతానంతరము ఈలోకమునుండి సత్యలోకము నకు పోయి అక్కడ ముక్తిని పొందును.

(4) **పరమహంస**

జిజ్ఞాసువు అనగా, తత్త్వజ్ఞానమును గోరువాడు

- విధ్యుక్త కర్మలను పాటించు సాంప్రదాయిక సన్న్యాసి. ఇతడు సర్వదా బ్రాహ్మణుడు మాత్రమే
- ఇతడు సంప్రదాయానుసారి కాని సన్న్యాసి. అయినను అత్యంత పరిణతి జెందిన వాడు గనుక విధ్యుక్త కర్మలను, ఆచారమును లక్ష్యపెట్టడు. ఇతడు ఏ వర్ణము వాడయినను లేక మ్లేచ్ఛుడు గూడ కావచ్చును.

లేక జ్ఞాని, అనగా ఆత్మానుభూతి పొందిన జ్ఞాని. ఇతడు ఈ లోకమున ఇపుడే ముక్తుడు.



అద్వైత వేదాంతమును చక్కగా, సమగ్రముగా తెలియగోరు సత్యశోధకులైన సాధకులకు అవశ్య పఠనీయమైన అత్యుత్తమ గ్రంథరాజము 'కైవల్య నవనీతము'.

భగవాన్ శ్రీరమణమహర్షి ఈ గ్రంథమును తమ ప్రసంగములలో పేర్కొనేవారు.

ఈ గ్రంథములోని మొదటి ప్రకరణము పరతత్త్వమును సవివరముగా ప్రతిపాదించుచున్నది; రెండవ ప్రకరణము తత్త్వాధ్యయన సమయమున కలుగు సర్వ సంశయములను రమణీయముగా నివారించుచున్నది.

ఈ గ్రంథము శ్రద్ధాభక్తులతో గాఢముగా అధ్యయనము చేయు సాధకులకు మోక్షమార్గమును సుగమము చేయగలదు. అందువలన కైవల్య నవనీతమను పేరు ఈ గ్రంథమునకు సార్ధకము.

ఆంధ్రసాధకులు ఈ గ్రంథాధ్యయనము వలన వివేక, వైరాగ్య సంపన్నులై తమ జీవితములను చరితార్ధము గావించుకొందురు గాక.



శ్రీరమణాశ్రమము
తిరువణ్ణామలై

www.sriramanamaharshi.org
ISBN 978-81-8288-186-0



ఓం తత్ సత్ 🌹🌹🌹🙏 రమణార్పణమస్తు🙏